సాహిత్య

# ప్రస్థానం

మే 2012

వెల రూ. 10



" కర్షక వీరుల కాయం నిండా
కాలువ కట్టే ఘర్మజలానికి
ఘర్మ జలానికి
ధర్మ జలానికి
ఘర్మజలానికి ఖరీదు లేదోయ్"
- శ్రీశ్రీ

సాహితీ స్రవంతి

PRSVM02A137

సాహిత్య
# ప్రస్థానం
మే 2012
సంపుటి : 12 సంచిక : 76

## పుస్తకాలూ... బిరుదులూ... సత్కారాలూ...

సాహిత్యం సమాజ ప్రగతికి దోహదం చేయాలి. విలువైన సాహిత్యం ఆ పని సమర్థవంతంగా చేస్తుంది. ప్రజల స్థితిగతులను లోతుగా అవగాహన చేసుకుని కళాత్మక రచనగా పాఠకులకు అందజేయడానికి రచయిత కృషి చేయాలి. ప్రపంచీకరణ విధానాలతో సమాజం వేగంగా అనేక మార్పులకు లోనవుతున్నది. ఒక వైపు మిరిమిట్లు గొల్పే జీవనశైలి, కార్పోరేట్ అవినీతి, రాజకీయ దిగజారుడుతనం, సామాజిక అశాంతి. ఉగ్రవాదం, మహిళలపై దుర్మార్గమైన హింస. రైతుల ఆత్మహత్యలు వంటి తీవ్ర సమస్యలు, మరోపక్క కుటుంబం మొత్తం చాకిరీ చేసినా తీరని కనీస అవసరాలు. మొత్తంగా బహుళ జనావళి అంతులేని అభద్రత మధ్య జీవనం కొనసాగించవలసి వస్తుంది. ఈ పరిణామాలను నిశితంగా పరిశీలిస్తూ ప్రజల వాస్తవిక జీవన లోతుల్ని కళాత్మకంగా రచయితలు చిత్రించాలి. అటువంటి రచనలను పాఠకులకు చేర్చాలి. ఆ దిశగా తమ కలాలకు పదును పెట్టడంలోనే ఔచిత్యం ఉంటుంది. ఇటీవల సాహిత్యరంగంలో వ్యక్తిగత కీర్తి, ప్రతిష్టలకోసం తపన చెందడం పెరిగింది. కేవలం కొద్దిపాటి రచనలు చేసి పుస్తకాలు వేసుకుని సంతృప్తిపడిపోయే ధోరణి పెరిగింది. ప్రయత్నపూర్వక అవార్డులు, బిరుదులు, సత్కారాల సభలు వేలం వెర్రిగా జరుగుతున్నాయి. అలనాటి రాజుల నుండి ఈనాటి కార్పోరేట్ ప్రభువుల వరకూ రచయితలను ప్రలోభాలకు గురిచేసే ఇటువంటి ప్రయత్నం కనిపిస్తుంది. ఈ రకమైన వాతావరణం ఒక కొత్త రకమైన దిగజారుడు సంస్కృతిని వ్యాప్తిచేస్తుంది. కొన్ని సంస్థలు, కొందరు వ్యక్తులు ఇటువంటి ధోరణులను ప్రోత్సహిస్తున్నారు. ఈ పరిణామం ఔత్సాహిక రచయితలను తప్పుదారి పట్టించే అవకాశం ఉంది. ఆర్థిక వనరులు ఉన్నవారు పుస్తకాలను వేసుకోవచ్చు. అయితే పుస్తకం వేసుకోవడానికి కేవలం ఆర్థిక సామర్థ్యం కొలబద్ద కావడమే సమస్య. కవిగా, రచయితగా తొందరగా గుర్తింపు పొందవచ్చనే ఉద్దేశ్యాలు వంటివి వీటి వెనుక ఉంటాయి. ఎటువంటి అవగాహనా లేకుండా సాహిత్యరత్న, సాహిత్య భూషణ్ వంటి బిరుదులు ఏర్పాటు చేయడం, ఏం రాసారో తెలియకుండానే రచయితలని చెప్పి పలువురికి ఆ బిరుదులు ప్రకటించడం ఆ ధోరణికి నిదర్శనం. ఇటువంటి పరిణామాలు వ్యక్తిగతంగానూ, సామాజికంగానూ ఎవరికీ మేలు చేయవు. వీటికి భిన్నంగా రచయితలు ఇప్పటికే వచ్చిన సాహిత్యాన్ని అధ్యయనం చేయాలి. సీనియర్ రచయితల కృషిని అవగాహన చేసుకోవాలి. రచనా వ్యాసంగాన్ని సామాజిక బాధ్యతగా స్వీకరించి, మెరుగైన రచనలు చేయడానికి సాధన చేయాలి. అటువంటి రచనలతో పుస్తకాలను ప్రచురించుకుంటే తగిన గౌరవం దక్కుతుంది. ప్రచారం చేసుకునే పరిస్థితి కాకుండా వాటికవే పాఠకులకు చేరువయ్యే స్థాయిలో విలువైన రచనలు చేయడానికి కృషిచేయాలి. అవార్డులు, బిరుదులు, సత్కారాల సంస్కృతిని రచయితలు అధిగమించి పరిణతి కనబర్చాలి.

---

సాహిత్యరంగంలో శివసాగర్‌గా ప్రాచుర్యం పొందిన కె.జి. సత్యమూర్తి ఇటీవల కన్నుమూసారు. పలు కళాత్మక రచనలు చేసిన శివసాగర్ చివరి వరకూ పేదప్రజల కోసం నిలబడ్డారు. అభిప్రాయాల్లో తేడాలున్నా ప్రజాపక్ష రచయితగా శివసాగర్‌కు ఆ గౌరవం దక్కుతుంది. ఆయనకు ప్రస్థానం నివాళి అర్పిస్తున్నది.

ముఖచిత్రం : కార్మిక విజయం
శిల్పి : డా. దేవీ ప్రసాద్ రాయ్ చౌదరి
ఫొటో : గుడిపూడి విజయరావు

బొమ్మలు : చంద్ర, శివాజి, వెంకటేష్

## ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వొరప్రసాద్
వల్లభాపురం జనార్ధన

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ

# కాదేదీ పోరు కనర్హం

- ఉదయమిత్ర



**"గుర్... గుర్ర్... గుర్ర్..." మంటూ పందుల గుంపు బయల్దేరింది.**

**అవి తలలు కిందికి దించి ఒకదాన్నొకటి రాసుకుంటూ ఏవో సొదలు చెప్పుకున్నట్టుగా రోడ్డు మీద నడుస్తున్నాయ్. సుమారుగా యాభై పందులు "గుర్ర్... గుర్ర్..." అంటూ కోరస్ అందుకోవడంతో వాటిలోకి సంగీతమేదో వొచ్చేసింది. అది వరాహ సంగీతమేమో...**

**వాటిని చెదిరిపోకుండా మనుష్యులు అటూ ఇటూ ఉండి నడిపిస్తున్నారు. పందులు గదా... ఎండలకు తట్టుకోలేవు గాబట్టి వాటి వీపుల మీద అప్పుడప్పుడు నీటితో తడుపుతున్నారు. కొందరు చిన్న పంది పిల్లల్ని చిన్న పిల్లల్ని భుజానేసుకున్నట్టు వేసుకొని నడుస్తున్నారు.**

కొన్ని పందుల మెడలకు అట్టలు వేలాడదీసి వున్నాయ్. వాటి మీద 'మమ్మల్ని చంపొద్దు' "మేం ఊరిని శుభ్రం చేస్తున్నాం", "వాతావరణాన్ని కలుషితం చేసేది మనుషులే", "మేమేం పాపం చేశాం" అనే నినాదాలు రాసి ఉన్నాయ్.

నిజం ఒప్పుకు తీరాలి. కొన్ని ఊరేగింపుల్లో మనుషుల కన్నా ఈ పందులే ఇంత క్రమశిక్షణతో నడుస్తున్నాయ్. మనుష్యుల కన్నా బురదలో పొర్లాడే పందులే నయమనిపిస్తుందొక్కోసారి. అవి ఎక్కడ ఆగమంటే అక్కడ ఆగుతున్నాయి.. ఎక్కడ మలుపు తిరగమంటే అక్కడ మలుపు తిరుగుతున్నాయ్.

బురదలో పందులని ఈసడించుకున్నా, అవి ఇంత పద్ధతిగా నడవడం ఆశ్చర్యమే మరి... ఏదైనా నడిపించే వాళ్ళని బట్టి ఉంటుందేమో.. మొత్తం మీద దృశ్యం వింతగానూ, కొత్తగానూ, చూపరులను కట్టిపడేసేదిగాను ఉంది.

ఆ పందుల వెనుక "ఎరుకల సేవా సమితి" వారు నిర్వహిస్తోన్న ఊరేగింపు నడుస్తోంది. అందులో మొండివాళ్ళు, ఎరుకల వాళ్ళు, యానాది వాళ్ళు ఉన్నారు. మరేవో ఇతర సంఘాల సభ్యులూ ఉన్నారు.

మొండివాళ్ళలో కొందరు చెర్నాకోలలు దీస్కొని వీపులు చిట్లగొట్టుకుంటున్నారు. కొందరు చిన్న చిన్న చాకులు గల గొలుసులతో చేతుల మీద కొట్టుకొని రక్తాలు గారుస్తున్నారు. స్త్రీలు వీరావేశంతో "జమిడికే" వాయిస్తున్నారు.

వందలాదిమంది నినాదాలతో, పాటల్తో వాతావరణమంతా వేడిక్కి ఉంది.

"ఎరుకల సేవా సమితి వర్ధిల్లాలి"

"లంబాడా హక్కుల సమితి వర్ధిల్లాలి"

"దళిత బహుజన విద్యార్థి సభ వర్ధిల్లాలి"

"మా బతుక్కి ఆధారమైన పందుల్ని చంపొద్దు"

"సర్కారు వారి నిరంకుశ విధానాలు నశించాలి"

"పందులపై దుష్ప్రచారాలు మానాలి"

"కాలుష్యం నింపేదెవరు? పందులుగాదు.. ఫ్యాక్టరీలు.."

"కాలుష్యం నింపేదెవరు? పందులు గాదు... మనుష్యులే.."

"ఎరుకలోల్లు, మొండోల్లు, యానాదులూ మనుష్యులే"

"ప్రాణాలయినా అర్పిస్తాం... పందుల్ని కాపాడుకుంటాం..."

కొత్త కొత్తగా పుట్టుకొచ్చే నినాదాలతో కొత్త పాయలు గల్సిన నదిలా ఉంది ఊరేగింపు. దానినిండా జీవితపు సంఘర్షణ ఒదిగిన పాటలా ఉంది. మురికి బట్టలూ, మురికి దేహాలూ, మురికి బతుకులూ...వాటిలోంచి స్వచ్ఛమైన ఆగ్రహజ్వాల ఏదో గాలిని మండిస్తోంది.

రోడ్డు మీద పోయే జనాలు కొద్దిసేపు ఆగి చూసి పోతున్నారు. కొందరు తమ తమ పనులు ఆపి చూస్తున్నారు. పెద్దింటి స్త్రీలు బంగళాలపై నుండి చూస్తున్నారు...పిల్లలేమో ఉత్సాహంగా చప్పట్లు గొడ్తున్నారు.



నినాదాల గాలి వాటి వీపుల మీదుగా పాకిందేమో... పందులు ఉత్సాహంగా నడుస్తున్నాయ్. అవి ఠీవిగా ఫోజులిస్తుంటే కెమెరాలు, వీడియోలు దృశ్యాల్ని తమలో బంధిస్తున్నాయ్...

.. .. ..

దేశంలో చాలా ఉద్యమాలు జరిగాయి.

బస్సు ఛార్జీలు పెంచితే ఎడ్ల బండ్లలో ఉద్యమాలు చేశారు. కరెంట్ ఛార్జీలు పెరిగితే కందిళ్ళతో – పశుగ్రాసం అందకపోతే పశువుల్తో... ఇలా ఎన్నో ఉద్యమాలు జరిగాయి. ధర్నాలు, రాస్తారోకోలు, పికెటింగ్‌లు అనేకం చేశారు.

కాని, ఇలా పందుల్తో ఉద్యమించడం ఇదే మొదటిసారి.

అసలు ఈ పందులేమిటి? ఈ గొడవేమిటి?

.. .. ..

గత ఆరునెలలుగా సర్కారు వారికి ఓ కొత్త జ్ఞానోదయమయి ఓ కొత్త పథకాన్ని ముందుకు తెచ్చారు... అదే "పందుల నిర్మూలన".

మేకల వల్ల అడవులు పాడయిపోతున్నవనే వింత వాదన అప్పట్లో సర్కారోళ్ళకు తెల్సి వొచ్చి, నానా హంగామా చేశారు... అసలు రోగమెక్కడుందో, మందేమి వెయ్యాలో సర్కారోల్లకు తెల్సినట్టు లేదు... నిజానికి ప్రజలకు సర్కారే సమస్యగా మారుతోంది.

ఇప్పుడు పందుల సమస్య... వాటివల్ల వాతావరణ కాలుష్యం పెరిగి పోతోందనీ... "మెదడువాపు" వ్యాధి పెరిగిపోతుందనీ... కొత్త వాదనలు ముందుకు తెచ్చారు.. ప్రజల చెవిలో క్యాబేజీ పూలు పెట్టారు. సహజంగా మనుష్యులకు పందులంటే ఈసడింపు గాబట్టి, వాళ్ళు వెంటనే నమ్మేశారు. దానికి తోడు సర్కారు వారి "క్లీన్ అండ్ గ్రీన్" తోడయ్యింది.

పందులు పోతేనే ఊరు శుభ్రపడుతుందనే నమ్మకానికి వచ్చేశారు ప్రజలు.. పంచాయతీ వాళ్ళకీ, మున్సిపాల్టీ వాళ్ళకీ పందుల్ని చంపడంలో తమ వంతు సహకారాన్ని అందించడం మొదలెట్టారు.

.. .. ..

అంతా బాగానే వుంది.

మరి వాటి మీదనే ఆధారపడ్డ వాళ్ళ సంగతో...?

అసలు వాళ్ళ ఆలోచనలేమిటో... వాళ్ళ బతుకులేమిటో అటు వైపన్నా తొంగిచూశారా? అనాదిగా నిషేధించబడ్డ కులాలు గావడంతో వాళ్ళ జీవితాలు" వెల్గు చూడాల్సిన చీకటి కోణాలు" గానే మిగిలిపోయాయి.

నాకు తెల్సినంత మట్టుకు, ఊరి బయలు గుడిసెలు, పందులు, వాటి గూళ్ళూ, బురద, రోత వాసన తప్ప ఇంకేమీ తెలిసేది గాదు... అసలు వాళ్ళది ఒక బతుకేనా? అన్నట్టుండేవారు.

నేను పాలమూరు జిల్లాలో షాద్‌నగర్ తాలూకాలోని కొత్తపేట స్కూల్లో పనిచేస్తున్నప్పుడు మా ఇంటికి ఎదురుగా ఎరుకల స్త్రీ ఉండేది. పొట్టిగా, తెల్లగా, మహా అందంగా ఉండేది. ఎరుకలోళ్ళలో అంతటి అందగత్తెలుంటారని నేను నమ్మలేకపోయాను. బురదలోంచి లేచిన తెల్ల కలువలా ఉండేదామె.

ఓ రోజు తమ చేలో పందులు పడ్డాయని తిట్టడానికొచ్చాడో పెద్ద మనిషి.. ఆయనో ప్రధానోపాధ్యాయుడు... అగ్రకులస్థుడు..

రోడ్డుకు అవతల వైపు ఆమె... మురికి బట్టలు... మైల చేతులు..

రోడ్డుకు ఇవతల వైపు ఈయన... తెల్లబట్టలు... శుభ్రమైన శరీరం..

రావడంతోనే బండబూతులు లంకించుకున్నాడు. "బద్మాష్‌లం... నీ పందుల్ని మంది చేలలోకి తోలి, ఈడెవ్వని తాన పండుకున్నావే... అవి సేనంత దొక్కి పెద్తె నీయమ్మ మిండెడు గట్టిస్తాడే బద్మాష్..." ఇట్లాంటివే అనేకం తిట్లు... ఓ టీచరుకు అన్ని బూతులొస్తాయని నాకప్పుడే జ్ఞానోదయమయింది.

ఆయన రోడ్డు కవతల వైపు నిలబడి తిడ్తున్నా.. ఆమె గాలి సోకితేనే మైలబడి పోతానేమోనన్నట్టుగా వొంగి, కడుపు లోపలికి లాక్కొని ఆమె ముఖం చూడకుండా... తిట్టడం చూశాను. ఎరుకల వాళ్ళంటే అంత అసహ్యమన్నమాట... ఇన్ని మాటలంటున్నా ఆమె మౌనంగా నిల్చుందేగాని, ఆ అగ్ర కులస్తుణ్ణి పల్లెత్తు ఒక్క మాటా అన్లేదు... ఇది చాలాకాలం కిందటి మాటనుకోండి.

.. .. ..

'సందట్లో సడేమియా'లాగా అప్పట్లో కొందరు బడాబాబులు సీమపందుల్ని మార్కెట్లోకి తేవాలని ప్లాన్ వేశారు. సీమ పందులకు గిరాకీ పెరగాలంటే ఊరపందులు ఉండగూడదు గదా... అందుకని పందుల్ని ఏదో ఒక సాకు పెట్టి నిర్మూలించే పథకం సిద్ధం చేశారు.

అదే పందుల నిర్మూలన...

క్రమంగా దొంగలొచ్చి ఎత్తుకుపోయినట్టు తమ ఇండ్ల ముందుండే పందులు, ఒక్కొక్కటే చంపబడ్తోంటే వాళ్ళకు దిక్కు తోచలేదు. వాళ్ళకు తమ శరీరాల్లోని భాగాల్ని ఒక్కొక్కటిగా కోసి తీసుకుపోతున్నట్టనిపించింది. వాళ్ళు విలవిల్లాడిపోయారు. సర్కారును తిట్టుకున్నారు. తాగొచ్చి పక్కోళ్ళతో గొడవపెట్టుకున్నారు. చివరకు 'ఎరుకల సేవా సమితి' కింద సమైక్యమై ఓ ఉద్యమంగా ముందుకొచ్చారు.

నిజానికి వాళ్ళా ఊరేగింపు తీయడాన్కి పడ్డ కష్టం ఇంతా అంతా గాదు... "పందుల్తో ఊరేగింపేమిటి?" అని జోకులేసి పోలీసు పర్మిషన్ ఇవ్వలేదు. చివరకు వాళ్ళు కోర్టు ద్వారా పర్మిషన్ తెచ్చుకున్నారు.

ఆ ఊరేగింపు ఆ రోజుకి పెద్ద హైలెట్... అందర్లోనూ ఇదే చర్చ.. పందుల గురించి అసహ్యించుకునే మనుష్యులకి పందుల గురించి ఆలోచించేటట్టు చేశారు. హ్యాట్సాఫ్... అందరూ తొక్కుకుంటూ పోయే మట్టిని బొమ్మగా మారిస్తే, దండెం పెడతారు గదా... ఇదీ అంతేనేమో...

.. .. ..



''గుర గుర'' మంటూ పందులు కలెక్టరాఫీసు గేటు దాటాయో లేదో బిరబిరమంటూ పోలీసులొచ్చి అక్కడే ఆపేశారు.

వాళ్ళకు పందుల ఊరేగింపుకు బందోబస్తుగా రావడం గుర్రుగానే ఉంది. ఆఖరికి పందులకు కూడా లోకువై పోయామని లోపల్లోపల ఉడుక్కుంటున్నారు.

అక్కడి సిబ్బందికీ గుర్రుగానే ఉంది...

కలెక్టర్‌గారికయితే యమ గుర్రుగా వుంది.

పందుల్ని ఆపడంలో అవి పోలీసుల వైపు కోపంగా చూసి ముట్టెల్తో తిట్టు సైగలు చేసి, అసహనంగా చెట్టు కింద నిలబడిపోయాయి.

చెట్ల ఆకులు అల్లాడటం లేదు... ఎండ నిల్చికొట్తోంది.

.. .. ..

"పందుల్ని చంపడం మానెయ్యాలె..."

"ఎరుకల సేవా సమితి వర్ధిల్లాలి"

"బీదల కడుపులు కొట్టొద్దు"

"సర్కారు నిరంకుశ విధానాలు... నశించాలి..."

ఒక్కసారిగా నినాదాల్తో ఆ ప్రాంతమంతా దద్దరిల్లిపోయింది. అక్కడ పైరవీలకొచ్చిన వారు, బెంచీల మీద కూర్చొన్నవారు, ఆఫీసు సిబ్బందీ వొచ్చి ఆ వింత దృశ్యాన్ని చూస్తున్నారు.

మొండి రాముడు కొరడాతో ''ఛెళ్ ఛెళ్'' మని కొట్టుకుంటున్నాడు.. అతని వీపు చిట్లి రక్తం కారుతోంది. అతడు రక్తం చిందించడం ద్వారా సర్కారుపై తన కోపాన్ని వెళ్ళగక్కుతున్నాడు... యానాది వాళ్ళు, ఎరుకల వాళ్ళు కోపంతో ఊగిపోతున్నారు..." ఎక్కడా ఏమీ జరగనట్టు మా పందుల్నే చంపుతారా?" అంటూ సర్కారును బెండాకు పసరు కాడి నుంచి తిట్టిపోస్తున్నారు.

.. .. ..

ఎస్.ఐ. జీపుదిగి ఠీవిగా వచ్చాడు.

"ఏయ్... మీ మందిల లీడరెవడ్రా?" అంటూ కోపంగా అడిగాడు.

దూరంగా పందుల వేపు చూస్తూ..

"ఎందుకు సార్.." గుంపులోంచి అడిగారెవరో...

"ఎందుకేంది... మీలోంచి నల్గురిని కలెక్టర్ బిలుస్తున్నడు" అసహనంగా కదిలాడు ఎస్.ఐ.

"లేద్సార్... గాయనే మా దగ్గరికి రావాలె..." అందరూ ఒక్క గొంతుతో అరిచారు.

"మేం రావాలంటే... మా పందులూ వస్తయి..." నవ్వులే నవ్వులు..

"పందులు లేంది మేం లేం..." ఇంకొకరు.

"కలెక్టర్ రావాలె... కలెక్టర్ రావాలె..." గోల గోలగా అందుకున్నారు...మళ్ళీ నినాదాలు హోరెత్తాయి.

సుడిగాలిలో ఎండుటాకులా అయ్యాడు ఎన్.ఐ. చేసేది లేక వెనుదిరిగాడు.

.. .. ..

పందుల నిర్మూలనలో సమరోత్సాహం చూపిన కలెక్టర్‌గారు దిగిరాక తప్పలేదు. ఆయన చిటపటలాడుతూ అక్కడికి చేరుకున్నాడు.

అక్కడ ప్రెస్ వాళ్ళున్నారు... అప్పట్లో ఇన్ని ఛానళ్ళు లేకపోయినా కొందరు టి.వి. వాళ్ళు అక్కడికొచ్చారు. అక్కడ మీడియాను చూసి శాంతించాడు గాని లేకుంటే ఆయన వాలకం మరో రకంగా ఉండేది.

ఎత్తుగా, దృఢంగా అందంగా ఉన్నాడాయన. ముఖం మాత్రం జేవురించి ఉంది. దూరంగా ఉన్న పందుల కేసి తేరిపారా చూశాడాయన. తన చుట్టూ ఉన్న సేవా సమితి సభ్యుల్ని చూశాడు. ఆయనకు పందులూ, సేవా సమితివాళ్ళూ ఒకేలాగ కన్పించినట్టున్నారు.

బహుశా తన సర్వీసులో ఇట్లాంటి పరిస్థితి ఒకటొస్తుందని, పందుల సమస్యల్ని, ఈ మురికి వెధవల సమస్యల్ని వినాల్సి వస్తుందని ఆయన ఊహించి ఉండడు. ఛాన్సు లేదు గాని, తనకే గనుక పవర్స్ ఉంటే వాటన్నింటినీ అక్కడికక్కడే కాల్చేసి, ఆ సభ్యుల్ని చెట్లకు ఉరిదీసేవాడే. కాని ఏం చేస్తాడూ! కోర్టు ఆర్డరొకటి ఏడ్చిందిగదా... ఇండియాలో డెమొక్రసీ అస్సలు పనికిరాదనీ, డిక్టేటర్‌షిప్ ఉండాలనీ దృఢంగా నమ్మేవాళ్ళలో అతనూ ఒకడు.

అందరూ నిశ్శబ్దమయ్యారు. పాలు తాగుతున్న పసివాడు రొమ్ము విడిచి అటుగా చూశాడు.

"ఊ... చెప్పండి. ఏమిటిదంతా?" విసుగ్గా అడిగాడాయన.

సుతారంగా చెమట తుడుచుకుంటూ.

ఆయనలా అడుగుతుంటే, నాకు కొత్తపేటలో ఎరుకల స్త్రీని తిట్టిన ప్రధానోపాధ్యాయుడే జ్ఞాపకమొచ్చాడు.. అన్నట్టు ఈయనా అగ్రకులస్తుడే...

"సార్.. మేం బతికేది పందుల మీద.." ఓ దృఢస్వరం విన్పించింది.

"ఐతే..."

"వాటిని మీరు లెక్కవెట్టి పగవట్టి సంపవద్దిరి – అసలే కరువుకాలం... మేమెట్ల బతకాలె.."

"మీరు మీ పందుల గురించి మాట్లాడుతున్నారు. అవతల వాతావరణ కాలుష్యం పెరుగుతున్నది..."

"సార్... ఈ కాలుష్యమన్నది మా వల్ల ఏర్పడుతున్నదా?" అంటూ

ఎరుకల సేవా సమితి అధ్యక్షుడు రాందాస్ ముందుకొచ్చాడు.

ఊరి బయట ఫ్యాక్టరీ సంగతేంది? దాని నుండి కెమికల్ నీళ్ళొచ్చి పక్కన వాగునీల్లు సత్తెనాస్ జేసినయి. వాగు పోద్ది పదహారు గ్రామాలోల్లకు సాగునీరు, తాగునీరు లేక సస్తున్నరు. మా పట్నానికొచ్చే నీరు గూడ బందయ్యింది. ముందుగా ఫ్యాక్టరీని మూయించుర్రి..."

"సార్... గా పెద్ద పెద్ద హోటల్ల నుండి, గా సినిమా టాకీస్ల నుండి, ఫంక్షన్ హోల్ల నుండి, గా పబ్లిక్ పాయిఖాన్ల నుండి ఎంత మురికి బయటకొస్తున్నది... అయ్యన్నీ మూసెయ్యుర్రి... తర్వాత మా పందుల దగ్గరికి రార్రి..."



"గంతెందుకు సారూ... గీ పట్నం చుట్టూ ఇరవై రైస్ మిల్లులున్నయ్. వాటి నుంచి కాలుష్యం రాదా?"

"అసలు ఊల్ల మురికి కాలువలు తీసేటోడు లేక సెడ కంపు గొడ్తున్నాయి."

ఎరక్కపోయి వొచ్చి యిరుక్కునట్టయ్యిందాయనకు.

"సరే... సరే... చెప్పిర్రు గదా... మేం చెప్పేది గూడా వినండి... ఈ పందుల నుండి "మెదడు వాపు" వ్యాధి వొస్తున్నదని పై నుండి ఆర్డరొచ్చింది... మరి మేం యాక్షన్ తీసుకోవాలె గదా..." అసలు విషయం బయట పెట్టేడాయన.

"గట్లయితే..." అంటూ జమిడీకే జంగమ్మ ముందుకొచ్చింది. "గీ పందుల తోటి" మెదడువాపు రోగమొస్తే మరి మేం... రోజూ గీ పందుల్తోటే సావాసం చేస్తం గదా... మరి మాకూ... మా పిల్లలకూ రాదెందుకు ఈ రోగం..." నడుం మీద చెయ్యేసుకు అడిగిందామె..

"ఔనౌను.. మాకెందుకు రాదు... మాకెందుకు రాదు" కోరస్ అందుకున్నారు.

కలెక్టరు చల్లబడ్డాడు.

"బాబూ... ఎంతయినా.. ఊళ్ళ పందులుంటే ఊరికి మంచిది కాదు గదా... ఊళ్ళ తిరుగుతుంటే ఏవయినా రోగాలు రావొచ్చు గదా..."

కలెక్టర్ అనునయించాలని చూశాడు.

"గట్లనా... గట్లయితే.. ఊరు బయట మా పందులకు షెడ్డు గట్టియ్యండ్రి..."

"కట్టియ్యాలె... పందులకు షెడ్లు కట్టియ్యాలె..."

"మా పందుల్ని చంపితే మమ్ములను చంపినట్లే..."

"మళ్ళీ నినాదాలు మొదలయ్యాయి.."

"సరే.. సరే... మీ డిమాండ్లు రాసివ్వండి... పైకి పంపుతాం..." ఎట్టకేలకు దిగొచ్చాడాయన.

"పెద్దగా ఏమున్నయి సార్... ఫ్యాక్టరీలడ్గుతున్నామా... భూములడ్గుతున్నామా... మా పందుల్ని చంపొద్దంటున్నం..."

"ఇప్పటికిప్పుడంటే... ఎట్ల కుదుర్తుంది..."

"ఎందుకు కుదరదు సారు... ఇప్పటికిప్పుడనుకొని మా పందుల్ని సంపుతలేరా... ఇన్ని వందల మందిమి అడ్గుతున్నం చంపొద్దని... నల్గురు కూచొని చేసే నాశనం కన్నా, వందలమంది అడిగే మేలు పని మంచిదికాదా... సెప్పుర్రి..."

"సరే... సరే... ఆలోచిస్తం..."

"కుదరదు సార్... మాకు మీ నుండి హామీ గావాలె... లేకపోతే మా పందుల్తోటే ఇక్కడిదిక్కడ గ్యాస్ నూనె పోస్కొని అంటించుకుంటం..."

"మీ ఆఫీను ముందరే పానాలిడుస్తం"

"మాకు ఆడర్‌గావాలె... ఆడర్.."

"లేకపోతే... మా పానాలు తీస్కోండి.."

కలెక్టర్ గోడకు కొట్టిన బంతిలా వెనక్కి తిరిగాడు.

.. .. ..

మళ్ళీ సద్దుమణిగింది. అశాంతితో గూడిన నిశ్శబ్దం.. లోపలేం జర్గిందో తెలీదుగాని ఓ గంటసేపయినంక ఆఫీసు నుండి కబురొచ్చింది. ఇద్దరు ముగ్గురు ముఖ్యమైన వ్యక్తులు అటెండర్‌ను వెంబడించారు.

అందరిలోనూ ఉత్కంఠ.

ఏంజేస్తడో? తమ సభ్యుల్ని పోలీసులకు పట్టిస్తాడేమో..లేక తమపై లాఠీఛార్జీ జేయిస్తడేమో... అయినా ఎట్లయితది.. తమకు కోర్టు ఆర్డరుంది గదా...

.. .. ..

పందులను చెట్ల నీడలకయితే తెచ్చారు గాని, వాటిని చెదిరిపోకుండా చూడటం పెద్ద సమస్యయి పోయింది. నీళ్ళతో అప్పుడప్పుడూ వాటి వీపుల్ని తడుపుతున్నారు. చూసేవాళ్ళకి "వీళ్ళు పందుల్ని ఎట్లా చూసుకుంటారా?" అనిపిస్తుంది.

ఎండ పొడ మనుష్యుల్ని అతలాకుతలం జేస్తోంది. కొంతమంది దగ్గరే ఉన్న నల్లా దగ్గరికి పోయి నీళ్ళతో కడుపు నింపుకుంటున్నారు. చెట్టు మీద కాకి ఒకటి కింద జరుగుతున్న దృశ్యాన్ని పక్క కాకికి చెబుతున్నట్టుగా వుంది.

# ఏప్రిల్ నెల పురస్కారాలు



## ఢింసా దారిలో...

కథకు........రూ.700/-

రచయిత : ఎస్. బాలసుధాకర్ మౌళి



## అంతర్లోకం - బహిర్ దుఃఖం!

కవితకు.......రూ.500/-

రచయిత : రాధేయ

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

అందరిలోనూ ఉత్కంఠ పెరిగిపోతోంది.

"ఔనన్నా... మన పందులే ముర్కి జేస్తున్నయా... మనుష్యులు ముర్కి జేస్తలేరా?" బీడీ ముట్టించుకుంటూ అడిగాడు యానాది ఎల్లడు.

ఎందుకు జేస్తలేర్రా.. అసలు పందులు జేసే ముర్కి కన్నా మనుషులు జేసేదే ఎక్కువ.."

"యాదవడితే ఆడ ఉచ్చలు బోస్తరు.. మూత్రశాలలుండవు.. ఎప్పటివో ముర్గు కాల్వలు.. వానొస్తే మురికంతా రోడ్డు మీదనే.."

"గంతెందుకురా.. గీ కలెక్టరాఫీసు పక్కన ఎంత పెద్ద ముర్కి కాలువుందో... గాయన తనది జూసుకోడు.. మందికి జెప్తడు.."

"ఊరి మధ్యన నల్లగుంట చెరువు ఎంత ముద్దుగుండె.. సిన్నప్పుడు చాపలు, కొర్రమట్ట వడ్తిమి... ఇప్పుడది మురిగ్గుంట అయ్యింది..."

"అంటంగనీ... గీ సదూకున్నోల్లంత ముర్కోల్లు ఇంకోరు ఉండరన్నా..."

"ఊరి నిండా గబ్బు పెట్టుకోని, గీ మురికేదో పందుల సుట్టే తిర్గుతున్నట్టు మాట్లాడతరు.."

"పందుల సంగతి సరే.. మన కులాల్ని గూడా ఎలేసిన్రు గదా.."

ఆకుల సందు నుండి ఎండ సూదుల్లా గుచ్చుతుంటే, తీరొక్క రీతిగా చర్చలు నడిచాయి.

.. .. ..

లోపలేం జరుగుతున్నదో..

కాయవుతదో.. పండవుతదో.. బత్కులెట్ల తెల్లార్తయో.

"అగో.. అగో.. బయటికెల్లిన్రు.." అరిచారెవరో..

"ఔనురో.. సేతిల కాయితం గూడ కనవడ్తున్నది..." ఇంకోరు అందుకున్నారు.

మెట్లు దిగి వొస్తుంటే, దృశ్యం మనోహరంగా ఉంది. గుర్రం మీద విజయకేతనం మోసుకొచ్చే సైనికుల్లా ఉన్నారు వాళ్ళు. రాందాస్ చేతిలో ఆర్డర్ కాగితం జెండాలాగ రెపరెపలాడ్తోంది. అతడిని భుజాల మీద ఎత్తుకు వొస్తున్నారు.

అందరిలోనూ కరెంట్ ప్రవహించినట్లయి లేచి నించున్నారు.

జమిడీకె మోగింది...

"ఎరుకల సేవా సమితి వర్ధిల్లాలి.."

"ఎరుకల, మొండివాళ్ళ, యానాదుల ఐక్యత వర్ధిల్లాలి.."

"లంబాడీ హక్కుల సమితి వర్ధిల్లాలి"

నినాదాలు పాయలై నదిగా మారాయి.

ఆర్డర్ కాగితాన్ని రాందాస్ అందరికీ చదివి వినిపించాడు.

పందుల నిర్మూలన రద్దు చేయబడ్డది.

మిగతా డిమాండ్లు కాల వ్యవధిలో నెరవేరుస్తారు.

హద్దులేని ఉత్సాహం ఆకాశాన్ని తాకింది... గట్టిగా అరిచారు... ఈలలు వేశారు.. కౌగిలించుకున్నారు... కళ్ళనీళ్ళ తుడుచుకున్నారు... గుండె నిండా ఊపిరి బీల్చారు... తేలికైన మనసుతో ఇంటి వైపు కదిలారు.

.. .. ..

పందులు ముట్టెలూపుతూ నడవసాగాయి. వాటికేమన్నా అర్థమయ్యిందేమో... అవి ఉండుండీ... ఒకదాని ముట్టెతో మరొకదాన్ని తాకుతూ... తోకలూపుకుంటూ... వరాహ రాగంలో పాటలేవో పాడుకుంటూ ముందుకు నడవసాగాయి. ఉరిశిక్ష రద్దయిన ఖైదీల్లా ఉన్నాయవి...

ఒక వినూత్న ప్రయోగం విజయవంతమయింది.

"మా సుఖ శాంతుల మీద / మీరు దాడి చేసినంతకాలం / చీపురు పుల్లను సైతం / ఆయుధం జేసి / మీ నిద్రల పొలిమేరల మీదకి / నిరంతరం దాడులు జేస్తాం.." అన్నాడో పాలస్తీనా కమాండరు.

అతి తక్కువ జాతి మనుష్యులు, అత్యంత హీనమైన పందులతో అలజడి రేపి, డిమాండ్లు సాధించుకున్నారు.

"కాదేది పోరు కనర్హం" అంటే ఇదేనేమో...

సెల్ : 9985203376

# ఆలాపన

- డా॥ ఎన్. గోపి



నాలో నేను మాట్లాడుతుంటాను
గాలి మాట్లాడుతున్నట్లుంటుంది
మూడురోజులుగా నడుస్తున్నా
కొండ దృశ్యం మారదు
నేనే నడుస్తుంటాను
కొండ ఎదురొస్తున్నట్టుగా వుంటుంది
పాడేది నేనే
నా పాట అందరి నోటా వినిపిస్తుంది
నాకు నేనే విచ్చుకుంటాను
పువ్వులు వికసించినట్లుంటుంది

నిద్రపోతుంటాను గాని
కలలపైన అధీనం ఉండదు
లీలగా నాలో ఓ అద్దం కదుల్తుంటుంది
నాకు నేనే కనపడేది దానిలోనే

ఎక్కడికి వెళ్ళినా
నా జేబులో ఓ కిటికీ వుంటుంది
ఓ తారక తొంగి చూస్తుంది గాని
పరిచయం గుర్తుండదు

గ్రహాలు టెలిస్కోపులో బంధీలవుతాయి
విదిలించికొడితే
ఆశ్చర్యం!
అవి నా పద్యాలై పరిభ్రమిస్తాయి

# అనుబంధాలు సీడీల పాలు

- ఎన్. అరుణ



ఫ్యాను గాలి తప్ప
ఇప్పుడు పైరగాలి లేదు
సిమెంట్ మెట్లే తప్ప
పొలం గట్లు లేవు

నాన్న వేలు పట్టుకొని
మైళ్ళకు మైళ్ళు తిరిగిన ఉత్సాహం
ఇప్పుడు గదిలో
వాకర్‌తో సావాసం

జీవన విన్యాసాలు
ఎక్వేరియంలోని చేపల పాలు
పెరట్లోని పావురాలు
తెలియని ఆకాశాల పాలు

చంద్రోదయాలూ
సూర్యోదయాలూ
డ్రాయింగ్ రూంలోని ఫ్రేముల పాలు
ఆప్యాయతలూ
అనుబంధాలూ
ర్యాకుల్లో సీడీల పాలు

ఆధునిక జీవితం
క్షణ క్షణ వైవిధ్యభరితం
నగరీకరణం
తృప్తినివ్వని పద్యం

# మౌన రణం

- మెరాజ్ ఫాతిమా
సెల్ : 8500001203



ఇద్దరి మధ్యా నిశ్శబ్దం రాజ్యమేలుతుంది
మాటల సౌధానికి మౌనపు వెల్ల వేసినట్లుంది
ఒకరి ఆలోచనలు ఒకరు పసిగట్టినట్లు ఉలికిపాటు
ఒకరి మాటలు ఇంకొకరు పలికినట్లు ఏమరుపాటు
ఏమైనా జరిగితే బావుండు, ఎవరైనా వస్తే బావుండు
ఎంత పోసినా కుండ నిండని పొగ వంటి ఆలోచనలు
వెలుగో, వేడిమో... తెలీని స్తబ్దత
ఆకలో, అలకో తెలీని నైరాశ్యత
ఉండి, ఉండీ చెళ్ళుమనిపించే... గత స్మృతులు
... ... ...

చేయీ చేయీ పట్టుకొని భావి కలలకు రెక్కలు కడుతున్నప్పుడు
హెచ్చువేతలే కానీ... తీసివేతలు ఉండవని లెక్కలు కట్టినప్పుడు
ఒకరి శిల్పాన్ని... ఇంకొకరు ఇష్టంగా చెక్కుకున్నప్పుడు

అనుబంధపు ఆకుపై అనుమానపు ముల్లు పడుతుందనీ..
అంతరాలను అసహనాల సెగలు అంటుకుంటాయనీ..
మాటల తూటాలు మనసు మర నుండే బైటకొస్తాయనీ...
తెలియని అవివేకం... మాయమైన వివేకం
ఏకాంతం కోసం అందరికీ దూరం అయ్యాం
రాజీ కుదర్చమని ఎవరినీ దేవురించలేం..
కదిలే శవాల్లా... కాలాన్ని దొర్లిస్తున్నాం
వేసుకున్న ముడిని విప్పుకోవాలని చూస్తున్నాం
ఇద్దరిలో ఎవరో ఒకరు దూరాన్ని చెరిపేస్తే...
కప్పుకున్న నిప్పుల దుప్పటి దూరంగా విసిరేస్తే..
రాబోయే... ఆ చిన్న ఆకారం సాకారమైతే...
రగులుతున్న మౌనరణం... ముచ్చటైన పలుకుగా మారదా...

# రచయిత రాజ్యం



- రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి

నీ వారసు రాజ్యంలో నీతికి తావేది బాపు?
నీ మాటలు విని ప్రాణమునిలుపుకునేదెట్లుబాపు?
లంచము ముట్టొద్దంటావు వంచన చెయ్యొద్దంటావు
నీతి నిజాయితీలు అంటవు ఖ్యాతి ప్రతిష్టలు అంటవు
మోసం చెయ్యొద్దంటవు, వేసం వెయ్యొద్దంటవు
అన్యాయం వద్దంటవు వ్యభిచారం తప్పంటవు
అంతా అందరిదంటవు అందరు బ్రతకాలంటవు
హృదయము మారును అంటవు - హింసకు దిగవద్దంటావు
నీ వారసు రాజ్యంలో నీతికి తావేది బాపూ?
నీ మాటలు విని ప్రాణము నిలుపుకునేదెట్లు బాపు?

అడుగుదీసి అడుగేస్తే అవినీతి తప్పనిసరి
ఆడంబర మార్భాటము అభివృద్ధికి మారుపేరు
వ్యవహారం దక్షతకు వంచనయే కొలబద్ద
ఆధునాతన సంఘ మందు వ్యభిచారం జీవగర్ర
కలిగి వున్న ప్రతిభలెల్ల కల్లలాడకుంటె దుల్ల
అడుగుదీసి అడుగేస్తే అనివార్యము ఆత్మహత్య

బాపూ మార్గము ప్రాణము బాపుమార్గమన్నట్లా?
నీ వారసు చేతి చలువ నీ ఆత్మకు అగచాట్లా?
నీ వారసు రాజ్యంలో నీతికి తావేది బాపూ?
నీ మాటలు విని ప్రాణము నిలుపుకునేదెట్లు బాపూ?

జీవితమంతా గాంధేయవాదిగా బతికిన స్వాతంత్ర్య సమరయోధుడైన కవి కాళోజీ నారాయణరావు రాసిన కవిత ఇది. ఆయన ఈ కవితను 1963లో రాశారు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చి పదహారు సంవత్సరాలైంది. విద్యార్థిగా ఉన్నప్పుడు కాళోజీ పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రసంగాలు వినడానికి షోలాపూర్ వంటి సుదూర ప్రాంతాలకు స్నేహితులతో కలిసి వెళ్ళారు. ప్రథమ భారత ప్రధాని నెహ్రూ పాలన పదహారేళ్ళు గడిచిపోయినాక ఒకానొక గాంధీ జయంతి నాడు కాళోజీ ఈ కవిత రాశారు. నూరేళ్ళ స్వాతంత్ర్య పోరాటం ప్రజలకు కలిగించిన ఆశలు ఎలా అడియాశలు అయిపోయాయో, ఈ కవిత ముసుగులేని భాషలో వర్ణించింది. అప్పటికే భారత రాజ్యాంగం అమలులోకి వచ్చింది. పంచవర్ష ప్రణాళికాలు అమలవుతున్నాయి. ఆధునిక భారతదేశం నిర్మాణమౌతున్నదని భావించుకుంటున్నాం. పంచశీల ప్రబోధంతో పులకించిపోతున్నాం. అయినా ఒక గాంధేయవాది అయిన కవి ఈ కవితని ఇలా రాశారు. స్వతంత్ర్యం వచ్చిన పదహారేళ్ళలో ఆర్థిక రాజకీయాది రంగాలలో ఏవో జరుగుతున్నా దేశ ఆత్మగౌరవానికి గురైన నైతికంగా మాత్రం భారతదేశం పతనమైపోయిందన్న వాస్తవాన్ని కవి కలమెత్తిచాటారు. స్వతంత్ర భారత తొలి తరంలోనే మొదలైన ఈ నైతిక పతనం ఇవాళ్టికి మరింత తీవ్రమైపోయింది. అవినీతి నిర్మూలన కోసం ప్రత్యేక ఉద్యమాలు నడిచే అవసరానికి చేరుకుంది దేశం. అదే సమయంలో పేరు మోసిన అవినీతి పరులు కూడా అవినీతి నిర్మూలనోద్యమంలో పాల్గొనే దుర్దశ కూడా దాపురించింది. గాంధీజీ మీద ఇవాళ ఎన్ని విమర్శలున్నప్పటికీ, ఆయనే గనక ఇవాళ బతికుంటే 'డామిట్ కథ అడ్డం తిరిగింది' అనుకుంటూ వెళ్ళిపోయి గాడ్సే చేసిన పనిని తానే చేసుకునేవారేమో!

ఈ కవితలో మొదటి భాగమంతా గాంధీ ప్రవచించిన సూక్తులు. అది దేశ పునర్నిర్మాణానికి ఆయన అందించిన సూత్రాలు. రెండో భాగమంతా ఆయన వారసులు పాలకులై ఆ సూక్తులనూ, సూత్రాలను తుంగలో తొక్కి దేశాన్ని నైతికంగా ఎలా పతనావస్థకు చేర్చారో కవి చేసిన అధిక్షేపం. "అప్పుడప్పుడూ ఒపీనియన్సు ఛేంజ్ చేసుకుంటూ వుంటే గాని పొలిటీషియన్ కానేరడు" అన్న 1909 బ్రిటిష్ పాలకుల నాటి గిరీశం మాటల్ని యాభై నాలుగేళ్ళ తర్వాత స్వతంత్ర భారత పాలనలో కాళోజీ తన మాటల్లో చెప్పారా! అనిపిస్తుంది. "పతాకం మారింది పద్ధతి పాతదే" కాళోజీ మరో కవితలో అన్నమాట ఎంత సత్యమో ఆరున్నర దశాబ్దాల స్వతంత్ర భారత చరిత్ర రుజువు చేస్తున్నది. "కవి ప్రవక్త.. కాలం కన్నా ముందంటారు." అని గురజాడ అన్నమాటకు కాళోజీయే నిదర్శనం.

లంచం, వంచన అవినీతి, అన్యాయం, ఆర్భాటం, మోసం, వ్యభిచారం, ఆత్మహత్యలు, హింస. ఇవి లేని భారత దేశాన్ని నిర్మించాలన్నది గాంధీ ఆశయంగా కాళోజీ కవితలోని మొదటి సగం సారాంశం. స్వాతంత్ర్యానంతరం దేశం వాటితోనే ఎలా నిండిపోయిందో కవితలోని రెండో సగం చెబుతున్నది. అందుకే ప్రజా నిబద్ధత గల కవులు ఎప్పుడూ ప్రతిపక్ష పాత్ర నిర్వహిస్తారు. కాళోజీ నిరంతరం ప్రజా నిబద్ధతతో ప్రతిపక్ష కవిగానే బతికారు.

ఈ కవితను చదివి ఆరున్నర దశాబ్దాల స్వతంత్ర భారత చరిత్రను సమీక్షించుకొని వర్తమానానికి వస్తే 1963 లో కాళోజీ ఎత్తి చూపిన మన పాలకుల నైతిక పతనం ఇవాళ సంస్కరించలేని దశకు చేరుకుందా? అనిపిస్తుంది. ఒకరిద్దరిని మినహాయిస్తే ఏ నాయకుని కుర్చీ వెనక చూసినా గాంధీ బొమ్మ వ్రేలాడుతుంటుంది. చేసే పనులు

మరో రకంగా ఉంటాయి. మన నాయకులు ప్రజల్నే కాదు. వాళ్ళ మూల పురుషుల్ని కూడా వంచిస్తున్నారా? మోసం చేస్తున్నారా? అని ప్రశ్నలు పుడతాయి.

నీ వారసు రాజ్యంలో నీతికి తావేది బాపూ?
అడుగుదీసి అడుగేస్తే అవినీతి తప్పనిసరి

కుల ధ్రువీకరణ పత్రం ఇవ్వడం నుండి ప్రభుత్వం పడిపోకుండా కాపాడుకునే దాకా లంచం రక్తమై ప్రవహిస్తుంది. అవినీతి పరుడు కానివారు అధికారి కానరాదు అనే సూక్తి చెప్పాలన్నంతగా అవినీతి పెరిగిపోయింది. గడ్డి మెక్కని వాడు గద్దెనెక్కెదెందుకు? అన్న నానుడి స్థిరమై పోతున్నది. కబ్జా చెయ్యని వాడు కాలం చెల్లిన వాడుగా రూఢి అయిపోతున్నది." సొంత లాభము కొంతమానుకో, పొరుగువాడికి తోడు పడవోయ్" అన్న మోడస్టీని కూడా విస్మరించి సొంత లాభము నంత చూసుకు పొరుగువాడిని దోచుకోవోయ్" అన్నది సిద్ధాంతమై పోయింది. సామాన్యులే కాదు, మంత్రులు, ముఖ్యమంత్రులు, కేంద్రమంత్రులూ స్థాయి వాళ్ళమీద సిబిఐ విచారణలు, అరెస్టులూ జైళ్ళు కొనసాగుతున్న దేశంలో కాళోజీ అధిక్షేపానికి సమాధానం లభించే అవకాశమే లేదు. అవినీతి అంతర్జాతీయ సమస్య అని ఏనాడో చాటేశారు గాంధీ వారసులైన పాలకులే.

"ఆడంబర మార్భాటము అభివృద్ధికి మారుపేరు
వ్యవహారం దక్షతకు వంచనయే కొలబద్ద"

1963లో ఆడంబరాలు, ఆర్భాటాలు, వంచనలు ఎలా ఉండేవో గాని, ఇవాళ అవి అధికారానికి కాళ్ళు చేతులూ కళ్ళూ అయిపోయాయి. "బూతు పొగిడినట్లు " అంటాడు తిక్కన ఒక చోట. పాలకులు ప్రవేశపెట్టే సంక్షేమ పథకాలు ప్రజలకు తెలియడానికి కొంత ప్రచారం అవసరమే. అయితే ఇవాళ ఈ ప్రచారం సద్ది కన్న ఉప్పు ఎక్కువ' అన్నట్లు దుర్భరమై పోతున్నది. గల్లీ నాయకుని నుండి ఢిల్లీ నాయకుని దాకా గద్దెనెక్కినా గద్దె దిగినా పార్టీలో కొచ్చినా పార్టీలు మారినా, సొంత ఊరికి వచ్చినా, ఊరి నుంచి వెళ్ళినా ప్లెక్సీలు, పులివిస్తరాకుల్లాగా వీధులంతా వేలాడుతుంటాయి. ఛానెళ్లు, పత్రికలు ప్రకటనల హోరెత్తిస్తాయి. ఇంట్లోనే ఉండే భార్యకు ఇంట్లోనే ఉండే మొగుడు జన్మదిన శుభాకాంక్షలు టివి ఛానెల్‌ల ద్వారా తెలుపుతున్నారు. పట్టుకుంటే పట్టుచీర, ధర చెబితే మిక్సీ, నాలుగు ప్రశ్నలకు సమాధానాలు చెబితే కేజీ బంగారం, ఫలానా సినిమాకు నిర్మాత ఎవరో చెబితే సింగపూర్ యాత్ర, ఆకలి, నిరుద్యోగం విలయతాండవం చేస్తున్న దేశంలో ఈ ఆడంబరాలు, ఆర్భాటాలు బాధ్యతాయుతమైన పనులేనా? ఒక్క దేశంలోనే ఈ రెండు ప్రపంచాలు కొనసాగడం అభివృద్ధి అవుతుందా? కాళోజీ ఆవేదనను అర్థం చేసుకోవాలంటే నేలమీద నిలిచి ఆలోచించాలి.

"వ్యవహారం దక్షతకు వంచనయే కొలబద్ద"

ఈ కాళోజీ అభిప్రాయాన్ని సమగ్రంగా అర్థం చేసుకోవాలంటే, ఆయనే మరో సందర్భంలో అన్న వాక్యాల్ని కూడా ప్రస్తావించుకోవాలి.

ఓటిచ్చునప్పుడే ఉండాలెబుద్ధి
ఎన్నుకొని తలబాదుకున్ననేమగును?
తర్వాత ఏడ్చిన తప్పదనుభావము

ప్రజల్ని వంచించడం రాజకీయ కళగా రాటుదేలింది. ఏరుదాటి తెప్ప తగలేసే రాజకీయ క్రీడలో ప్రజలు నిరంతరమూ వంచనకు గురౌతున్నారు. వంచనా శీలం వ్యక్తి నుండి వ్యవస్థ దాకా పాకిపోయింది. ఆరాధన భావంతో ఓట్లేసిన ప్రజలు అవమాన భారంతో తలలు దించేసుకుంటున్నారు. ఆవేదనతో ఆక్రోశిస్తూ ఉన్నారు. చివరికేమి మిగిలినది? అని అయిదేళ్ళ తర్వాత ప్రశ్నించుకుంటే తక్కువమందికి పంపకం ఎక్కువమందికి వంచనం. ప్రభుత్వం కనుసన్నల్లో ప్రజల్ని దగా చేసిన ఇటీవల ప్రైవేట్ బ్యాంకుల ఉదంతాలే ఉదాహరణలు. గనులూ, వనాలూ, పరిశ్రమలూ అన్నిటినీ పిడికెడు మందికి ధారాదత్తం చెయ్యడం పాలకులు చేసే వంచనయే.

"అధునాతన సంఘమందు వ్యభిచారము జీవగర్ర
అడుగుదీసి అడుగేస్తే అనివార్యము ఆత్మహత్య"
పొట్ట కూటి కోసం మహిళలు శరీరాన్ని అమ్ముకోడం
ఏ నాగరికతకు నిదర్శనం?

అందుకోసమే కాలనీలు ఏర్పడడం ఏ అభివృద్ధికి సంకేతం? కువైట్‌లు, దుబాయ్‌లు వెళ్ళి రోగ పీడితులై మహిళలు తిరిగి రావడం ఏమి గర్వ కారణం? తిండి గింజలు పండించే రైతులు, మనిషి మానం కప్పే నేతన్నలు ఇంకా అనేకులు నిరంతరం ఆత్మహత్యలకు పాల్పడడం ఆధునిక సమాజ లక్షణమా? నీవేశుంతవు నీవేశుంతవు అనే పాలకుల సరసాల మధ్య ఆత్మహత్యలు నిత్య రుతువులుగా కొనసాగుతుండడం ప్రజా రచయితలు సహించడం సాధ్యం కాదు. ఆత్మహత్యలు సింహాసనా కాములకు సోపానాలు కావచ్చు. ప్రజా కళాకారులకు మాత్రం అవి ఆవేదనలు.

స్వాతంత్ర్యం వచ్చిన తొలి రోజుల్లో కాళోజీ
"యాంత్రిక జీవితం ఆరంభం
నీతి నిజాయితీలకు పాతర"

అన్నారు. ఇది ఆయన క్రాంత దర్శనంతో వేసిన పొలికేక. 1945లోనే నిజాంపాలనలోని "దొరలంత దొరతనము పేరిట చేసిన దోపిడీ చాలింక" అని గర్జించారు కాళోజీ.

సాంస్కృతిక సైనికులైన రచయితలు పాలకులను నిస్వార్థంగా నిలదీస్తారు. ప్రతిఘటిస్తారు. ప్రశ్నిస్తారు అధిక్షేపిస్తారు.

పోషించువాడవని పూజించు జనుల
పీఠమెక్కిన దాడి పీడించుటేనా?

అని అడుగుతారు. ఈప్రశ్నకు ఆరున్నర దశాబ్దాల పాలకుల దగ్గర సమాధానముందా? తీవ్రమైన ఆగ్రహం కలిగిన రచయిత పాలకులను హెచ్చరింపక తప్పదు. కాళోజి నిస్వార్థపరుడే కాదు, నిర్భయత్వానికి ప్రతీక.

ప్రజా సంస్థపై పగసాధించిన
ఫలితము తప్పక బయట పడున్....
ప్రజాశక్తిపై పందెం వేసిన
ప్రభుత్వమే పాటిగ నిలుచున్
నివురుగప్పిన నిప్పును వూదిన
నింత వెలిగి నింగిని ముట్టున్.

అని ఆయన హెచ్చరించడం ఆయన నిజాయితీకి తార్కాణం,. ఆయన ప్రజా నిబద్ధతకు నిదర్శనం. తాను అభిమానంచే నాయకునినైనా నిలదీయగల గుండె ధైర్యం కాళోజీది.

కానున్నది కాళోజీ కవి
కైత లోపల ఘూటగ చెప్పున్

పాలకులు కాళోజీ ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కుంటే, కాళోజీ అధిక్షేపాలను అర్థం చేసుకుంటే, పాలకులు పాజిటివ్‌గా ఆలోచిస్తే పాలకులు పనితీరు మార్చుకుంటే, మైండ్ సెట్ సవరించుకుంటే "అంత స్వర్గసుఖంబులన్నవి యావని విలసిల్లున్."

**సెల్ : 9440222117**

కథ

# సహజీవనం



- డా|| కప్పల బాబూరావు

**రిటైరు అయ్యాక కాలక్షేపంగా ఉంటుందని పెట్టిన ప్రైవేట్ క్లినిక్ కాస్త సీరియస్‌గానే నడుస్తుంది. వయసు మళ్ళిన, రిటైర్ అయ్యిన పేషెంట్స్ ఎక్కువగా రావడం బహుశా నా వయసు ప్రభావం వల్లనేమో లేక ఆలోచనా విధానం బేలన్సుడుగా ఉంటుందనో, వారి వయసుతో వచ్చిన అనారోగ్యంతో పాటు వారి వ్యక్తిగత విషయాలు, కుటుంబ విషయాలు చెప్పడం జరుగుతుంది.**

నేను వైద్య విద్య అభ్యసించే రోజుల్లో నా గురువులూ ఇలా చెప్పేవారు. డాక్టర్లు కుటుంబ డాక్టర్లుగా ఉండాలి. అప్పుడే వారి శరీర రుగ్మతలతో పాటు కుటుంబ సమస్యలలో కూడా సలహాలివ్వవలసి వస్తుంది. అప్పుడే మొత్తం సమాజం శ్రేయస్కరంగా ఉంటుంది అని. ఇప్పుడది నాకు కొంతవరకు నిజమనిపిస్తుంది. ఎందుకంటే చాలామంది వారి కుటుంబ సమస్యలు కూడా చెప్పడం జరుగుతూ ఉంటుంది. నేను ఆ కోణంలో కూడా ఆలోచించి వారికి సలహాలివ్వడం నాకు అలవాటై పోయింది. అందుమూలంగా చాలామంది వృద్ధులకు కొన్ని సందర్భాలలో నేను బాగా దగ్గరయ్యాను.

క్లినిక్‌లో పేషంట్స్ అందరూ వెళ్ళిపోయాక తీరికగా పేపరు చదువుతుండగా "నమస్తే డాక్టరుగారూ" అంటూ వచ్చారు సుమిత్రగారు. "నమస్తే సుమిత్రగారూ! బాగున్నారా? ఎలా ఉన్నారు?"

"ఏమోనండీ! ఏదో బాగానే ఉన్నట్టుంటుంది. అప్పుడే ఏదో గాబరా, గుండె దడ, ఎందుకో తెలియదు. బిపి ఎక్కువవుతుందేమో."

"బిపి మందులు సరియైన టైముకే వాడుతున్నారా లేదా?"

"ఏమిటో డాక్టరుగారు ఏదో పని. మనవలు బడికి వెళ్ళే హడావుడి. ఆ తర్వాత కోడలు ఆఫీసుకి వెళ్ళే హడావుడి. ఈ లోపల పది గంటలు అవుతుంది. ఏదో కళ్ళు తిరిగి నట్లుండటం, పడుకుండిపోవడం, బిపి మాత్ర వేసుకోవడం మరచిపోవడం."

"అలాగైతే ఎలాగండి! ఉదయాన్నే కాఫీతోనైనా వేసుకోమని చెప్పాను కదా? టిఫిను ఎన్ని గంటలకు చేస్తారో మీకే తెలియదు."

ఏమిటో డాక్టరుగారు ఉదయమంతా హడావుడిలో ఏమీ జ్ఞాపకముండదు."

"ఊ... సరే బిపి చూస్తానుండండి... ఒహో! చూశారా! బిపి నూట తొంభై బై వంద. ఇక మీకు ఎలా వుంటుంది మరి?"

"ఇప్పుడే బిపి మాత్ర వేశాను డాక్టరుగారు."

"ఇప్పుడు పదకొండున్నర అయింది. ఇదా మీకు మందు వేసుకొనే టైము?"

"ఏమిటో డాక్టరుగారు ఏమి చేస్తున్నానో నాకే తెలియడం లేదు. రాత్రులు నిద్రపట్టదు గాబరా."

"మీరు ముందు ఈ టెన్షను తగ్గించుకోలేరా?"

"ఎలా డాక్టరుగారు? ఉదయాన్నే లేచి టిఫిను చేసి పిల్లలకు పెట్టి వాళ్ళను బడికి తయారు చేయడం నా డ్యూటీ.

"మరి మీ కోడలు ఏం చేస్తారండీ?"

"ఆవిడ వంట చేసి అన్నీ సర్దుకుని ఆఫీసు కెళ్ళడం ఆవిడ డ్యూటీ. ఇలా వంతులు వేసింది మా కోడలు."

"అయ్యో ఈ వయసులో ఎలా చెయ్యగలరండీ?"

"మరి తప్పదు డాక్టరుగారు అలా వంతుల ప్రకారం చేయలేకపోతే చిరాకులు, పరాకులు, ఎత్తిపొడుపులు. ఇంటి దగ్గరుండి ఆ మాత్రం చెయ్యలేరా అంటుంది."

"మరి మీ అబ్బాయి ఏమీ అనడా"

"వాడే వంటాడం పిచ్చిసన్నాసి... వాడి లోకం వాడిది. ఉదయాన్నే కంప్యూటరు ముందు కూర్చుంటాడు. ఆఫీసు టైముకింత తిని ఆ కంప్యూటరు చంకనేసుకుని పోయి మళ్ళీ రాత్రి పది గంటల కొస్తాడు.



"మరి ఒక వంటమనిషిని పెట్టమని చెప్పండి మీ కోడలికి. "మీకీ హైరానా తప్పుతుంది."

"ఇంతోటి పనికి వంట మనిషా. మన పిల్లలకి మనం చేసుకోవడం కూడా కష్టంగా ఉందా అంటుంది మా కోడలు."

"ఏమైనా మీరు ప్రశాంతంగా ఉండటం, టైముకి మందులు వేసుకోవడం అవసరం."

"అలాగే డాక్టరుగారు వేసు కుంటాను."

ఈ లోపున రామచంద్రరావుగారని రైల్వేలో రిటైరయిన ఇంజనీరు. చాలా హుషారైన మనిషి. లోపలికి వస్తూ "డాక్టరుగారూ ఒక్క పేషెంటుతోనే మాట్లాడితే ఎలా? మమ్మల్ని కూడా కాస్త కనిపెట్టండి."

"అరే! మీరా రామచంద్రరావుగారు రండి. వీరు సుమిత్రగారని మన కాలనీలోనే ఉంటున్నారు. ఖాళీగా వున్నాను కదా అని కష్టసుఖాలు మాట్లాడుకుంటున్నాం... సుమిత్రగారూ... ఈయన రామచంద్రరావుగారని రైల్వేలో రిటైరయ్యారు. చాలా మంచివారు" అని పరిచయం చేశాను.

"ఆ... నమస్కారమండీ. ఈ డాక్టరుగారు మన బాధలన్నీ ఓపిగ్గా వింటారు. చాలా మంచివారు" అంటూ నాకొక మంచి కాంప్లిమెంట్ ఇచ్చారు సుమిత్రగారు.

"ఆ... నమస్కారమండి సుమిత్రగారు" అని రామచంద్రరావుగారు సుమిత్రగారికి నమస్కారం చేసి "అరే! మన వాకింగ్ పార్కులో మిమ్మల్ని రోజూ చూస్తున్నా. తలవంచుకుని వాకింగ్ చేస్తుంటారు సాయంత్రం."

"అవునండీ సాయంత్రం పార్కులో వాకింగ్ చేస్తున్నా ఉదయం నాకు ఖాళీ ఉండదు కదా."

"నేను ఉదయం సాయంత్రం కూడా వాకింగ్ చేస్తానండి. ఇక స్నేహితులతో పిచ్చాపాటీ మాట్లాడుతూ చాలా సేపు పార్కులో ఉంటాను."

సరే నే వస్తానండి డాక్టరుగారు" అంటూ సుమిత్రగారు బయలుదేరారు.

మళ్ళీ వారం తర్వాత చెకప్‌కి రండి రెగ్యులర్‌గా మందులు వేసుకోండి.

"ఆ... చెప్పండి రామచంద్రరావుగారు ఎలా వున్నారు?"

"ఆ... బాగానే ఉన్నానండీ. ఈ ఒంటరితనం తప్ప. ఎన్ని విధాలా జీవించడానికి ప్రయత్నం చేసినా ఆ ఒంటరితనం పోదు కదండీ?"

"అదేవిటీ మీరు కవితలు రాస్తారు. పెయింటింగ్ వేస్తారు. వాకర్సు పార్కు క్లబ్బులో అన్ని పనులు చాలా చురుగ్గా చేస్తారు. ఇక మీకు ఒంటరిగా ఉండటానికి టైమెక్కడిది?"

"లేదు డాక్టరుగారు ఈ వయసులో అన్నీ వున్నా ఏమీ లేనట్టే. ఒక తోడు ఉండాలి. మనతో మాట్లాడే వాళ్ళు మనం మాట్లాడితే వినే వాళ్ళు ఉండాలి."

"అవును రామచంద్రరావుగారు ఈ జీవితాన్ని మనం అనుకున్నట్లు జీవించాలి. జీవితాన్ని ప్రేమించాలి అంతేగాని లేనిదాని కోసం ఆలోచించే కన్నా మనకోసం మనం బ్రతకాలి."

"డాక్టరు గారూ... ఇవన్నీ చెప్పుకోడానికి సరిపడే మాటలు కాని జీవించడానికి కాదు కదా?"

"ఏంటీ! ఇంత వైరాగ్యం ఇంతవరకు మీలో నేను చూడలేదు. ఏదో కొత్తగా కనబడుతున్నారు."

"ఎందుకో తెలియదు డాక్టరుగారు. ఈ ఒంటరితనంతో దేనికోసమో ఆరాటం."

"ఇంతకీ మీ ఆరోగ్యం ఎలా వుంది? షుగరు, బిపి మందులు వేసుకొంటున్నారా?"

"భేషుగ్గా ఉంది. అన్నీ టైం ప్రకారం వేసుకొంటున్నాను."

"ఇలా కూర్చోండి. బిపి చెక్ చేస్తాను... అంతా బాగానే ఉందే, పర్‌ఫెక్ట్‌గా వున్నారు."

"ఇంకా ఏమిటి విశేషాలు డాక్టరుగారూ? వాకర్సు పార్కుకి రావడం లేదు. మీరు వస్తే ఆ ప్రాంతమంతా ఎలక్ట్రిఫై అయినట్లుంటుంది. మన మెంబర్లలో ఉత్సాహం ప్రతీసారి పెరుగుతుంది. మీరు ఏదో ఒక కొత్త యాక్షన్ ప్లేన్ చెప్తుంటారు."

"ఆ... ఏముంది. మన క్లబ్బులో అంతా ఉత్సాహవంతులు కదా ఏదో ఒకటి ఇన్నోవేటివ్‌గా చేయాలనిపిస్తుంది."

"మీ క్లినిక్ క్లోజ్ చేసే టైమయిందనుకుంటాను. ఇక నే వస్తాను. ఆదివారం తప్పకుండా పార్క్‌కి రండి డాక్టరుగారు."

"ఓకె తప్పకుండా వస్తానండీ."

రామచంద్రరావుగారు రైల్వే ఇంజనీరుగా రిటైరై మూడు సంవత్సరాలయింది. పది సంవత్సరాల క్రితమే ఆయన భార్య కేన్సరుతో చనిపోవడం జరిగింది. ఒకే ఒక్క కొడుకు అమెరికాలో భార్యా పిల్లలతో ఉంటున్నాడు. ఈయన ఒంటరిగా ఉంటున్నాడని, కొడుకు అమెరికా రమ్మని అర్థించినా వెళ్ళడం ఇష్టం లేక ఒంటరిగా కాలం గడిపేస్తున్నాడు. రామచంద్రరావుగారు జీవితాన్నెప్పుడూ సరికొత్త కోణంలో చూస్తూ సమాజ శ్రేయస్సు గురించి ఆలోచిస్తూ పని చేస్తుంటారు. ఈ సమాజం మూలంగానే మనం ఎదిగామని, ఈ స్థితిలో ఉన్నామని మరి ఈ సమాజానికి మనం ఏం చేశాం? ఏం చేస్తున్నాం? అని ఎప్పుడూ అంటారు. ప్రతివారికి కొంతైనా సమాజ స్పృహ ఉంటే బాగుంటుందని అంటారు. బాధ్యతలు తీరిన తరువాత కూడా నాకు, నాది అనే స్వార్థం మాని మనది, మనకు అని అందరూ ఆలోచిస్తే ఎంత బాగుండును అని అంటూ ఉంటారు.



సుమిత్రగారి భర్త సర్వీసులో ఉండగానే మూడు సంవత్సరాల క్రితం సడన్ హార్ట్‌ఎటాక్‌తో చనిపోవడం జరిగింది. అప్పటి నుండి కొడుకు కోడలుతో కలసి ఉంటున్నారు. భర్త పోయిన తర్వాత ఆవిడ పరిస్థితి ఒక ఇంటి పనిమనిషిగా అయింది. ప్రతి ఇంటి పని కోడలు వంతుల చొప్పున వేస్తుంది. పిల్లలను అత్తగారికి కొంతదూరంగా ఉంచడానికి ప్రయత్నం చేస్తుంది. పిల్లలతో ఆనందాన్ని వంచుకోవాలనే కోరిక ఆవిడకి తీరనిదయింది. సుమిత్రగారి కొడుకు రమణమూర్తి ఎప్పుడూ ఏదో వ్యాకులతతో ఉన్నట్టుంటాడు. తల్లి అంటే ప్రేమ ఉన్నా భార్య అంటే భయంతో అది వ్యక్తం చేయని పరిస్థితిలో ఉంటాడు. ఉన్న ఇల్లు డెవలప్‌మెంట్‌కిస్తే ముప్పై లక్షలతో పాటు రెండు ఫ్లాట్స్ కూడా ఇస్తామంటున్నారని, దానికి ఒప్పుకోమని ఎప్పుడూ తల్లిని కోరుతూ ఉంటాడు. కాని సుమిత్రగారికి అది ఇష్టం లేదు. తన భర్త ఇష్టపడి కష్టార్జితంతో కట్టుకొన్న ఇల్లు ఎలా అమ్మేస్తాం అంటారు. ఇది ఆమెకు ఒక తీరని సమస్యగా తయారైంది. ఈ ఇల్లు కూడా తన పేర లేకుంటే ఇక ఈ ఇంట్లో తన స్థానం ఎలా ఉంటుందో ఊహించగలదు. అందుకే అంటుంది. అది కోడలికి కోపం తెచ్చే నచ్చని విషయం ఆ ముసలిదానికి ఇంకా ఇంటి మీద తాపత్రయం ఏమిటి అంటుంది.

రెండు మూడు నెలలుగా పేషెంట్స్ ఎక్కువగా ఉండటం మూలంగా నేను ఎవరితోనూ మాట్లాడే సమయం కుదరలేదు. సుమిత్రగారు వచ్చి బిపి చెక్ చేయించుకొని వెళ్ళిపోతున్నారు. ఇదివరకటి కంటే ఆమెలో ఏదో కొంత మంచి మార్పు కనిపించింది. నిరాశ తగ్గింది. జీవితం మీద ప్రేమ పెరిగినట్లనిపించింది. మందులు వేసుకోవడంపై శ్రద్ధ పెరిగింది. ఆరోగ్యం కుదుట పడినట్లే కనిపించింది. ఆదివారం వాకర్స్ పార్క్ మిత్రులందరితో మాట్లాడుతూ ఉంటే అదో కిక్కు ప్రపంచంలో అన్ని విషయాల మీద వాడి వేడి చర్చలు జరుపుతారు. అంతా మేధావులు కదా మరి. వారి వారి అభిప్రాయాలు ఖచ్చితంగా చర్చిస్తారు. ఆ సమయంలోనే "అన్నా హజారే" లోక్‌పాల్ బిల్లు, అవినీతి, లంచగొండితనం గురించి దేశవ్యాప్తంగా మీడియా పరంగా చాలా చాలా చర్చలు జరుగుతున్నాయి. నేను చదువుకొనే రోజుల్లో మా మెడిసిన్ ప్రొఫెసర్ పాఠం చెప్పేటప్పుడు ఈ భూమ్మీద జీవరాశి ఉన్నంతకాలం మలేరియా దోమను నిర్మూలించడం అసాధ్యం అని చెప్పేవారు. అలాగే ఈ అవినీతిని ఎన్ని ఆందోళనలతోనైనా నిర్మూలించడం కష్టం అనిపిస్తుంది. ఈ నేపథ్యంలో మా మేధావుల చర్చలలో చాలా చాలా విషయాలు తెలుస్తుండేవి. ఓరి బాబోయ్ గాంధీగారి స్వతంత్ర పోరాట రోజులు వస్తున్నాయా అనిపించింది. అదే సమయంలో నేను దూరంగా వాకింగ్ ట్రాక్ మీద సుమిత్రగారు రామచంద్రరావుగారు నడుస్తూ మాట్లాడుకోవడం చూశాను. ఎక్కువగా రామచంద్రరావుగారు మాట్లాడుతున్నట్టు ఆవిడ తలవంచుకుని వింటూ నడుస్తున్నట్లుంది. నాకు మాత్రం చాలా చాలా సంతోషమనిపించింది. ఎంత సంతోషమంటే అమ్మాయి అల్లుడు జాలీగా మాట్లాడుకుంటున్నట్లనిపించింది. ఎందుకో వీరిద్దరి సహజీవనం ఆనందంగా ఉంటుందని ఊహించాను. ఈ విషయం మీద వీళ్ళిద్దరి మనస్సులూ ఎలా స్పందిస్తాయో కూపీ లాగాలనిపించింది. రెండురోజుల తర్వాత రామచంద్రరావుగారు క్లినిక్కి వచ్చినప్పుడు ఆయనలోని హుషారు ఆయన కళ్ళలో కనబడింది. ఆ మార్పుకి కారణం వెలికి లాగాలని నేను మనసులో అనుకుంటుండగానే నమస్కారం డాక్టరుగారు అంటూ వచ్చి రామచంద్రరావుగారు కూర్చున్నారు.

"నమస్తే రామచంద్రరావుగారు ఏమిటి విశేషాలు."

"ఏముంది సార్ కాలం గడిచిపోతుంది. మన క్లబ్ మెంబర్లందరూ ఈ నెలలో క్లబ్ డే చాలా ఘనంగా చేయాలంటున్నారు. దానికి మీరే సారధ్యం వహించాలి కదా. అందరి తలలో నాలుక లాంటివారు మీరు."

"ఆ.... దానికేముంది అలాగే చేద్దాం. సరే ఇక మీరెలా ఉన్నారు? మీ ముఖంలో ఏదో కొత్త కళ కనబడుతుంది."

"ఆ... ఏమీలేదు మామూలుగానే ఉన్నానే!"

"అవునూ... మొన్న ఆదివారం మీరు సుమిత్రగారితో కలసి వాకింగ్ చేస్తూ చాలా హుషారుగా మాట్లాడుతుండగా చూశాను.

"ఛ...ఛ... అదేంలేదు సార్ ఆవిడ కష్టాలు చెబుతుంటే వింటూ నా బాధలేవో చెపుతున్నాను. అందరికీ బాధలున్నాయి. అవి మనమే సరి చేసుకోవాలి. భయపడి ఆరోగ్యం పాడుచేసుకోకూడదు అని చెప్తున్నాను. ఆవిడ చాలా ఒంటరిగా ఫీలవుతున్నారు. ఇంట్లో మాట్లాడేవారే లేరంట. కోడలు పిల్లలను కూడా సరిగా మాట్లాడనీయదట. ఆవిడకి చేరువవుతారేమోనని భయమట."

"నిజమేనండీ... ఆవిడ ఒంటరితనాన్ని భరించలేక పోవడం మూలంగా ఆవిడ ఆరోగ్యం సరిగా ఉండటం లేదు. బి.పి. కూడా కంట్రోలు అవడం లేదు."

"పాపం సుమిత్రగారి కొడుకైనా ప్రేమగా చూస్తే బాగుణ్ణు. ఆయన ఏ రాత్రి పదిగంటలకో ఇంటికి చేరి మాట వరసకి మాత్రమే ఎలా వుంది అని అడిగి ఊరుకుంటాడట.

"రామచంద్రరావుగారూ... ఒంటరిగా ఉన్న వారికి సహచరి దొరికితే సమస్య పరిష్కారమవుతుందేమో?"

"అదెలా సాధ్యమవుతుంది డాక్టరుగారు ఈ వయసులో?"

"ఏం ఎందుక్కాదు? అన్నీ మనం చూసే కోణంలో ఉంటాయి. పరిష్కార మార్గం వైపు చూస్తే తప్పక కనబడుతుంది."

"అంటే మీరనేదేమిటి డాక్టరుగారు?" రామచంద్రరావుగారు కొంచెం తొట్రుపడ్డారు.

"ఏమీ లేదు. ఈ మధ్య పేపరులో చూస్తున్నాం కదా ఏ వయసులో నైనా సహచర్యంతో ఒంటరితనం పోయి శేషజీవితంలో మళ్ళీ సంతోషాన్ని పొందవచ్చు అని."

"అంటే మీ మనసులో ఏదో ఉంది! నాకు క్లియర్‌గా చెప్పండి." రామచంద్రరావు కంగారుగా అడిగారు."

"ఆ... ఏమీ లేదు రామచంద్రరావుగారు మీరు ఒంటరి జీవితం గడుపుతున్నారు. మీ అబ్బాయి దగ్గరికి అమెరికా వెళ్ళరు. లంకంత కొంపలో మీరొక్కరే ఉంటున్నారు. మీకొక తోడుంటే జీవితం సంతోషంగా ఉంటుందని నా ఉద్దేశం."

"అంటే డాక్టరుగారూ మీ ఉద్దేశం ఏమిటి? చెప్పండి"

"మీరు అన్యథా భావించనంటే ఒక విషయం చెప్తాను. మీరు సుమిత్రగారు సహజీవనం చేస్తే ఇద్దరి సమస్యలు తీరిపోయి సంతోషంగా ఉండగలరని నా భావన." అది విని రామచంద్రరావుగారు మౌనంగా ఉండిపోయారు. చాలా సేపు మాట్లాడలేదు. ఏదో తర్జనభర్జనలో గందరగోళం నుండి తేరుకొని "డాక్టరుగారూ... రోజూ వాకింగ్‌లో నేను సుమిత్రగారితో మామూలుగా మాట్లాడుతున్నాను. ఒకరి కష్టాలు ఒకరు చెప్పుకొని ఓదార్పుతో సంతోష పడుతున్నాం. కాని ఈ రకమైన ఆలోచన రాలేదు."



"మీ ఇరువురి కుటుంబాలకు ఫేమిలీ డాక్టరుగా నేను ఇలా ఆలోచన చేయడం సరియైనదని అనుకుంటున్నాను. మీకు అభ్యంతరం లేకపోతే నేను సుమిత్రగారితో నెమ్మదిగా మాట్లాడతాను."

"ఏమో డాక్టరుగారు నా బుర్ర ఒక్కసారిగా మొద్దుబారిపోయింది. ఇప్పుడాలోచించే స్థితిలో లేను. ఇది స్వార్థంతో కూడుకున్నదనిపిస్తుంది."

"ఒక్కోసారి ఒకరికి ఇంకొకరి స్వార్థం పరిష్కార మార్గం కావచ్చు."

"తర్వాత మాట్లాడుకుందాం డాక్టరుగారు నన్ను కొంచెం ఆలోచించుకోనీయండి" అంటూ రామచంద్రరావుగారు వెళ్ళిపోయారు."

రామచంద్రరావుగారి కుమారుడు శ్రీనివాస్ అమెరికాలో స్థిరపడిపోయినట్టే భార్య ప్రోద్బలంతో అక్కడ ఇల్లు కూడా సమకూర్చుకున్నాడు. అక్కడే పిల్లల చదువులు సాగుతున్నాయి. తనకి ఇండియా వచ్చేయాలని వున్నా ఇలా చేయలేకపోతున్నాడు. తండ్రి అంటే విపరీతమైన ప్రేమ, గౌరవం. అందుకే ఆయనను అమెరికా వచ్చి ఉండమని ఎప్పుడూ పోరుతూ ఉంటాడు. కాని రామచంద్రరావుగారికి ఆ దేశం వెళ్ళడానికి ఇష్టంలేదు. ఈ సమాజంలో ఈ స్థాయికి పెరిగిన మనం సమాజానికి చేతనైన సాయం చేయాలని సంకల్పం ఉన్న వ్యక్తి. అందుకే కొడుకు అభ్యర్థన సున్నితంగా తిరస్కరిస్తుంటారు.

ఒక వారం తర్వాత సుమిత్రగారు క్లినిక్‌కి చెకప్‌కి వచ్చినపుడు మామూలుగా పలకరించాను.

"ఎలా వున్నారు సుమిత్రగారు"

"బాగానే వున్నాను డాక్టరుగారు మీరే చెక్ చేయండి."

"అవును. బిపి నార్మల్‌గానే వుంది. అంటే టైముకి మందులు వేసుకుంటున్నారన్నమాట."

"అవును డాక్టరుగారు మీరు చెప్పినట్లుగా రోజూ వాకింగ్ కూడా చేస్తున్నాను."

"ఆ... నేను మొన్న ఆదివారం సాయంత్రం మీరు రామచంద్రరావుగారితో మాట్లాడుతూ వాకింగ్ చేస్తుండగా చూశాను."

"ఆయనతో వాకింగ్ చేస్తుంటే అసలు టైము తెలియడం లేదు. ఎన్నో విషయాలు నాకు చెప్తూ ఉంటారు. ఎంతో అవగాహన ఉన్న మనిషి నాకెంతో ధైర్యం చెప్తుంటారు.

"అవునూ.. ఆయన గురించి మీ ఉద్దేశం ఏమిటి?"

"ఉద్దేశం ఏముంటుంది చాలా మంచి మనిషి. సమాజ హితం కోరే వ్యక్తి స్వార్థ రహితంగా సమాజ రుణం తీర్చాలంటారు."

"అవును నిజమే మన వాకింగ్ పార్క్ క్లబ్బులో ఆయన ఎన్నో మంచి పనులు చేస్తున్నారు. మీరు రోజూ ఆయనతో వాకింగ్ చేస్తున్నారు కదా ఆయన గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

"మంచివారు. అభ్యుదయ భావాలున్న మనిషి."

"అది సరే... ఈ మధ్య ఒంటరిగా వున్న వృద్ధుల విషయంలో సహజీవనం అనే వార్తలు తరచుగా వింటున్నాం కదా మీ అభిప్రాయం ఏమిటి?"

"వార్తలు చదవడానికి బాగానే ఉంటాయండి. కాని ఎంతవరకు సఫలీకృతమవుతాయన్నది మనకు తెలియదు కదా."

"కానీ అది అసాధ్యం కాదు కదా?"

"డాక్టరుగారూ... నాకెందుకింత విపులంగా చెప్తున్నారు?"

"సుమిత్రగారూ... మీరేమి అనుకోనంటే నాదొక విన్నపం. జస్ట్ ఆలోచించండి. ఆవేశపడకండి. రామచంద్రరావుగారితో మీ సహజీవనం బాగుంటుందని అనుకొంటున్నాను."

"ఛీ..ఛీ.. నేను ఆయనతో ఒక మంచి మిత్రురాలిగా మాట్లాడుతున్నాను గాని అలాంటి ఆలోచనలు నాలో లేవు. అసలు మన సమాజంలో అలాంటి ఆలోచనకి కనీసం చోటు లేదు."

"సుమిత్రగారూ ప్రశాంతంగా ఆలోచించండి. మనం ప్రయత్నిస్తే కొన్నిటికి పరిష్కారం సంతోషంగానే ఉంటుంది."

"లేదు డాక్టరుగారు నాకలాంటి ఉద్దేశం లేదు రాదు" అంటూ లేచి వెళ్ళిపోయారు.

నాకెందుకో ఈ ఇద్దరి జీవితాలకి వారి సహజీవనం ఏ విధంగానైనా సమాజం స్వీకరించేలా మళ్ళీ వివాహబంధంతో పరిష్కరించాలనే ఆలోచన నాలో బలంగా నాటుకుపోయింది. ముందుగా సుమిత్రగారి కుటుంబ సభ్యులైన ఆమె కొడుకు కోడలితో మాట్లాడాలి. రామచంద్రరావుగారి కొడుకు శ్రీనివాస్ తండ్రి సంతోషం కోసం ఏదో చెయ్యాలనే తాపత్రయంతో ఉన్న వ్యక్తి కాబట్టి ఆ వైపు నుండి సులువుగా సమాధానం దొరుకుతుంది. ఇక సుమిత్రగారి విషయంలో చాలా కాలంగా ఆవిడ భర్త బ్రతికుండగానే వారి కుమారుడు రమణమూర్తి, అతని భార్య ఇంటి విషయంలో తమ పేరు మీద రాయమని పోరుపెడుతుండటం, ఈలోపు సుమిత్రగారి భర్త హార్ట్‌ఎటాక్‌తో చనిపోవడం, తర్వాత కూడా తల్లిని తరచు ఇల్లు డెవలప్‌మెంట్‌కి ఇచ్చేద్దామని అడుగుతుండటం, సుమిత్రగారు ససేమిరా అనడం జరుగుతుంది. ఈ విషయాలన్నీ నిశితంగా ఆలోచిస్తే ఒక ఖచ్చితమైన పరిష్కారం దొరికింది. ఒకటి సుమిత్రగారి కొడుకు రమణమూర్తితో ఇల్లు తన పేర అవ్వాలంటే సుమిత్రగారు రామచంద్రరావుగారితో సహజీవన విషయం పరిష్కారం చేయాలని నచ్చచెప్పి ఒప్పించడం జరిగింది. ఆ తర్వాత రామచంద్రరావుగారు కొడుకు శ్రీనివాస్‌తో ఫోనులో చెప్పగానే...ఓ... డాక్టరంకుల్... మీరు వెరీ వెరీ గ్రేట్. మా నాన్నగారికి ఒక నిర్దిష్టమైన తోడుంటే నాకెంతో సంతోషం. సుమిత్రగారు మా అమ్మ స్థానంలో ఉంటానంటే మా అమ్మే మరల బ్రతికి వచ్చిందని సంతోష పడతాను. ఆనందంగా నా తండ్రి జీవితంలోకి ఆహ్వానిస్తాను. అన్ని విషయాలు ఈ కోణంలో చర్చించండి. నేను ఇప్పుడు మీకు మెయిల్ పంపిస్తున్నాను. దానిలో నా అభిప్రాయం సుమిత్రగారికి చూపించండి. త్వరలో అన్ని ఏర్పాట్లు చేస్తే నేను వచ్చి దగ్గర్నుండి నాన్న అమ్మల పెళ్ళి రిజిష్టరాఫీసులో జరిపిస్తా అంటూ తన సంతోషాన్ని, అభిప్రాయాన్ని తెలియజేశాడు. నేను రెండు కుటుంబాలతో చర్చించిన తరువాత రెండు వైపుల నుండి ఏ విధమైన అభ్యంతరం లేకపోవడంతో రామచంద్రరావుగారు సుమిత్రగార్లతో అన్ని విధాల సమస్యల గురించి చర్చించి భవిష్యత్తులోని ఏ విధమైన పొరపొచ్చాలు జరగవని ఒప్పించడం జరిగింది. ఈ విషయం అమెరికాలో నున్న శ్రీనివాస్‌కి తెలియజేస్తూ మెయిల్ పంపాను. దానికి వెంటనే ఒక పెద్ద సమాధానం తన భార్యతో కలసి తిరుగు మెయిల్లో పంపాడు.



"డాక్టరంకుల్! మీకు ముందుగా నా శిరసు వంచి పాదాభివందనం చేస్తున్నాను. ఇంతవరకు అమెరికాలో మాత్రమే సాధ్యమనుకొన్న ఒక సాంఘిక సమస్య మీరు అక్కడ పరిష్కరించారు. మా నాన్నగారికి ఒక మంచి తోడు (నాకు అమ్మ) దొరికింది. ఇక నాన్నగారి విషయంలో నేను ప్రశాంతంగా ఉండగలను. ఏమైనా అంకుల్ నేను ఒక వారంలో అక్కడికి వచ్చి పనులన్నీ పూర్తి చేస్తాను. మొదటిగా నాన్నగారి పెండ్లి రిజిష్టరాఫీసులో చెయ్యడం. రెండవది ఇప్పుడు నాన్నగారి పేర నున్న ఇల్లు ఇద్దరి (అమ్మ, నాన్న) పేర్ల మీద రిజిష్టరు చేయడం. ఇక మూడవది సుమిత్ర అమ్మగారి పేర్న ఉన్న ఇల్లు వారి కుమారుడు రమణమూర్తి పేర్న రిజిష్టరు చేయడం. ఇవన్నీ ఒకే రోజులో జరిగిపోవాలి. వాటి అన్నిటిపైనా నేను మా ఆవిడ సాక్షి సంతకాలు చేస్తాం. ఆ విధంగా అన్ని ఏర్పాట్లు దయచేసి వెంటనే చేయండి. నేను వచ్చి అన్నీ సవ్యంగా జరిగేలా చేస్తాను. సుమిత్ర అమ్మకి నేను రాస్తున్న ఈ మెయిల్ చూపించండి. "అమ్మా... (సుమిత్రమ్మకి) ముందుగా మీకు పాదాభివందనం చేసుకుంటున్నాను. మీరు నాకు దేవుడిచ్చిగా అమ్మగా భావిస్తున్నాను. అమ్మా నాన్నగారు బాగా అభ్యుదయ భావాలు కలిగినవారు, సౌమ్యులు. నన్నెంతో గారాబంగా క్రమశిక్షణతో పెంచారు. కాని నేను నాన్నని వదిలి తప్పని పరిస్థితిలో అమెరికాలో ఉండిపోవలసి వచ్చింది. (ఆ విషయాలు మీకు తర్వాత చెప్తాను). నాన్నగారికి మీ తోడు దొరికిందంటే నాకు పట్టలేనంత ఆనందంగా వుంది. మీ కొడుకుగా నేను అన్ని బాధ్యతలు స్వీకరిస్తాను. మీ ఇరువురి శేషజీవితం సంతోషంగా ఉండాలని నా ఆశ. ఇందులో నాకే విధమైన స్వార్థం లేదు. నా పిల్లలకు నాన్నమ్మ కావాలి. పిల్లలు కూడా గ్రాండ్ మా, గ్రాండ్ పాని చూడాలని అంటున్నారు. ఇద్దరికి మూడు, ఐదు సంవత్సరాల వయసు. వాళ్ళు ఇక్కడ పుట్టిన తరువాత ఇండియాకు రావడం జరగలేదు. డాక్టరంకుల్ డేట్స్ ఫిక్స్ చేసిన వెంటనే నేనక్కడికి వచ్చి అన్నీ చక్కబెడతాను. మీరు దేనికీ బెంగపడకండి. పోయిన కష్టాలను మరచి పొండి. వర్తమానంలోకి సంతోషంగా అడుగుపెట్టండి. మీ కోడలు అన్ని విధాలా సహకరిస్తుంది. ఈ విషయంలో ఏ విధమైన శంక వద్దు. అమ్మా... ఇక ఉంటా.. ఇట్లు మీ కుమారుడు శ్రీనివాస్."

శ్రీనివాస్ ఇచ్చిన మెయిల్ సుమిత్రగారికి రామచంద్ర రావుగారికి చూపించడం. వారిద్దరు సంతోషాన్ని వ్యక్తం చేయడం జరిగింది. వారి ఇద్దరి సమ్మతితో రిజిస్ట్రేషన్ డేట్సు ఫిక్స్ చేయడం జరిగింది. ఆ మరుసటి రోజు వాకర్సు పార్కు క్లబ్బు సభ్యులందరిని సమావేశపరచి ఈ సమాచారం జరగవలసిన కార్యక్రమం తెలియజేసిన వెంటనే అందరూ కట్టలు తెంచుకున్న ఆనందంతో చప్పట్లు కొట్టారు. అందరూ రిజిష్టరాఫీసుకి ఆ రోజు రావాలని కార్యక్రమం దగ్గరుండి జరిపించాలని నిశ్చయించారు.

ఆ రోజు రానే వచ్చింది. శ్రీనివాస్ కుటుంబ సమేతంగా అనుకున్న తేదీకి వచ్చి చేయవలసిన కార్యక్రమాలు, రాతకోతలు రిజిష్టరు తేదీకి రెడీ చేసి అన్నీ దగ్గరుండి అనుకున్నట్లుగా రిజిష్టరు చేయించాడు. దానితో రామచంద్రరావు, సుమిత్రగార్ల భవిష్యత్తు సుఖ జీవనానికి ఏ విధమైన ఆటంకాలు లేకుండా సంతోష బాటలు ఏర్పడ్డాయి.

**సెల్ : 09849858524**

# నాలోని చీకటి

- సలీం



నాకు చీకటంటే యిష్టమన్నప్పుడు
నువ్వదోలా చూశావు
దొంగ చూపు కాదు
దొంగవైపు చూసే చూపు
వెల్తురులో
అన్నీ స్పష్టంగా కన్పిస్తుంటే
వూహకు తావెక్కడుంది?
చిక్కబడిన చీకటి
విశాలంగా పర్చుకున్న
నల్లటి కాన్వాస్
యిండియన్ యింక్‌తో గీసినట్టు
ఎన్నెన్ని చిత్రాలో
వణికే గీతల్లో
భయ విహ్వల చిత్రాలు

వెదికే పెదవుల కుంచెల్తో
రాసుకున్న మౌన దేహ లిపి
ఎన్ని రంగుల రాగాల్నయినా
వేదనాభరితం చేసే
మృత్యువు రకరకాల రూపాల్తో
నల్లటి జుట్టు విరబోసుకుని...
అలసిన కన్రెప్పల మీద వాలే
తుమ్మెద రెక్కల్లా మెత్తటి చీకటి
అందమైన దేహ కమలాల మీద
కమ్ముకునే మత్తైన చీకటి

నేను మాట్లాడేది
కన్పించే చీకటి గురించే కాదు
నీలో నాలో ఉన్న చీకటి గురించి కూడా
మన గుండెల్లో ముగ్ధలా
ముడుచుకు పడుకున్న చీకటి
మన మెదళ్ళలో ముద్దలా
బిగుసుకు కూచున్న చీకటి
ఈ వెల్తురే కాదు
ఎన్ని చీకట్లు కలిస్తేనో
నువ్వయినా నేనైనా
నువ్వు నన్ను ప్రేమించాలంటే
నాలోని చీకట్లనీ ప్రేమించాలి
నీనుండి విడదీయలేనంత
అంతర్భాగం చీకటైనపుడు
నేను చీకటినీ ప్రేమిస్తాను

---

# ఇప్పుడు ప్రశ్నిస్తున్నాం

- డా॥ వి. గీతా నాగరాణి



మేం ప్రశ్నించిందెపుడని?
ముక్కుపచ్చలారని పిల్లల్ని
ముసలోళ్ళకి కన్యాశుల్కాని కమ్మేసినపుడు
సతి పేరుతో నిండు ప్రాణాన్ని
చితి మీద పడుకోబెట్టినపుడు
వరకట్నం ఉరితాడై
మా మెడలకు చుట్టుకున్నప్పుడు
దుఃఖసాగరాల్లో మునిగామే తప్ప
ఖడ్గచాలనం చేసిందెపుడని?
ఎన్ని అనాచారాల్ని సంకెళ్ళుగా భరించి
ఎన్ని అకృత్యాల్ని అవమానాల్ని సహించి
యిపుడు ఆకాశంలో సగమని
ఆనందపడ్తున్న సమయంలో
మేం సాధించామనుకుంటున్న అభివృద్ధిని
అవహేళన చేస్తూ
గర్భస్థ పిండాల ఆక్రందనలు..
నాజీ నియంత యూదుల్ని మట్టుబెట్టినట్లు
ఆడపిల్లలు పుట్టకముందే చిదిమేసే
మరో జెనోసైడ్ మన దేశంలో

కడుపుల మీద యినుపరాడ్లతో బాది
కత్తుల్తో పొట్టల్ని చీల్చేసి
కాళ్ళతో లేలేత కంఠాల్ని తొక్కేసి
ఎన్ని రకాల రాక్షసకృత్యాలో
స్త్రీగా ఎదగడమే శాపమైన సమాజంలో
పుట్టడం కూడా పాపమైపోయిన వైనం
తన గర్భంపై హక్కులేని స్త్రీని
గర్భవతిని చేసే హక్కు నీకెవరిచ్చారు?

కుక్కపిల్లల్ని పంది పిల్లల్ని
సాకడానికి సన్నద్ధమవుతారు
ఆడపిల్లల్ని అంతకన్నా హీనమని
పిండాలుగానే చిదిమేస్తారు
ఆ గండం గట్టెక్కి పుట్టినా
ఉమ్మ నీరు వదిలేస్తే
వెచ్చటి అమ్మ ఒడి బదులు
డ్రైనేజీ మురికి నీటి కౌగిలింత
చెత్తకుండీ ఆవాసం
చివరికి ఏ కుక్కలకో ఫలహారం
జాతి మనుగడకు ప్రాణం పోసిన ఖ్యాతి
మారణ హోమం ఇలానే కొనసాగితే
మరి కొన్నాళ్ళకు మాయమైపోతుందన్న భీతి
అందుకే ఇప్పుడు ప్రశ్నిస్తున్నాం
పులుల కోసం అభయారణ్యాలు సరే
ఆడపిల్లలకేది అభయహస్తం?
కళ్ళు తెరవకముందే కాలం చెల్లిపోయే
అమానవత్వం నుంచి కాపాడే
అమృత హృదయం?

కథ

# తెగించిన సాలమ్మ



- తుమ్మా భాస్కర్

**సూర్యుడు నడినెత్తి మీదకు రావడంతో భూమి మండిపోతుంది.**

**వాగు ఒడ్డున గూడిన జనం కోపంతో ఊగిపోతున్నారు.**

**సరిగ్గా నీరు ప్రవహించని వాగు. గండు ఇసుక మేట వేసి వుంది. దాని ఒడ్డున దరిదాపుల్లో తోడులేక ఒంటరిగా ఉన్న పెద్ద తుమ్మ చెట్టు. దానికి అపుడపుడు జంగాలలతోనే సహవాసం.**

జంగాలు కులస్తులు ఆ చెట్టు కింద పంచాయతీ పెట్టారు. పక్కన పెట్టిన పొయ్యి మీద నూనె సలసల కాగుతుంది. అక్కడ చేరిన గుంపుకు ఎదురుగా పాతికేళ్ళ అమ్మాయి చేతులు కట్టుకొని వధశిలపై నిలబడ్డట్టుగా మౌనంగా వుంది. ఆమె కళ్ళ నుండి నీరు కారుతున్నాయి.

“ఒసే! సాలమ్మ! ఇపుడేడ్చి ఏమి లాభమే? ఈ బుద్ధి ముందే ఉండాలి. తప్పు సేసినపుడు గిదంతా గుర్తుకు రాలే” అంటూ ఒకావిడ ముందుకు వచ్చి సాలమ్మ నెత్తి మీద మొట్టింది.

“ఆ పోరగాడిని సూసైనా నీకు ఈ పని ఎలా సేయాలనిపించిందే?” అంటూ సాలమ్మ అత్త వచ్చి ఒక లెంపకాయ వేసింది.

సాలమ్మ ‘అమ్మ’ అని అన్నదే గాని స్పందన లేదు. ఆమె దూరంగా నీటి గోతిలోకి చిన్న చిన్న రాళ్ళను విసురుతున్న తన కొడుకును చూసేసరికి ఏడుపు ముంచెత్తింది. వాడికి ఈ పంచాయతీ ఏమి పట్టనట్టుగా తన లోకంలో తానున్నాడు.

ఆమె పరుగున వెళ్ళి వాడిని గుంజుకుని గుండెలకు హత్తుకుంది.

ఆమె మొగుడు లచ్చిగాడు పరుగెత్తుకుంటూ వచ్చి “లంజె! వాన్ని తీసుకునే హక్కు నీకెక్కడిదే? సిగ్గు లేనిదానా!” అంటు పెళ్ళం గుండెల్లోని కొడుకును గుంజుకొని వచ్చి చెట్టుకింద నిలబడ్డాడు.

పిల్లవాడు “అమ్మా...’ అంటూ ఏడవసాగాడు.

“అయ్యో దేవుడా! నా కడుపున పుట్టిన కొడుకుని కూడా దూరం చేస్తున్నారా?” అని నెత్తి బాదుకోసాగింది. అది చూపరులకు హృదయ విదారకంగా ఉంది.

జంగాలు పొయ్యి దగ్గరకు వచ్చి తన చేతికున్న ఉంగరం తీసి గిన్నెలో కాగుతున్న నూనెలో వేసి, “ఒరే లచ్చిగా! మళ్ళొకసారి నీ పెళ్ళం సేసిన తప్పేంటో అందరికి వినొచ్చేట్లు సెప్పు” అంటు లచ్చిగాడ్ని ఆదేశించాడు.

జరీ అంచు గలిగిన పంచె కట్టుకొని, తలపై గళ్ళ రుమాలు చుట్టి, పెద్ద మీసాలు కలిగిన జంగాలు ఆ ప్రాంతంలోని జంగం కులస్తులకు పెద్ద. అతనికి దాదాపు తొంభై సంవత్సరాల వయసుంటుంది. అయినా అతనికి కంటి చూపు, వినికిడి, జ్ఞాపకశక్తి, సత్తువ ఏవీ తగ్గలేదు. వారి కులంలో కులాచారం ప్రకారం నేరపూరితమైన సమస్యలొస్తే కింది కోర్టయినా, పై కోర్టయినా అంతా అతనే. చదువుకోని, జీతంలేని న్యాయాధికారి. అతని మాటకు, తీర్పుకు తిరుగులేదు. ఆ కులస్తులెవరికి పోలీసులు, పోలీసు స్టేషన్ తెలియదు. అతను ఏదైనా పంచాయతీ పెట్టినపుడు నేరారోపణ చేయబడ్డ వారికి రుజువు చేసుకునే అవకాశం ఇస్తాడు. కాకపోతే అవి విచిత్రంగా ఉంటాయి.

పంచాయతిలో నిందితులు తమ నేరాన్ని ఒప్పుకుంటే ఫర్వాలేదు. లేదంటే, కాలుతున్న గడ్డపారను పట్టుకోవడమో లేదా సలసల కాగుతున్న నూనెలో చేతులు ముంచి అందులోని ఉంగరాన్ని తీయడమో చేయాలి. ఈ పరీక్షల్లో చేతులు కాలితే నేరం చేసినట్టుగా భావించి జరిమానాను విధిస్తూ తీర్పిస్తాడు. చేతులు కాలకపోతే జరిమానా వేయకుండా వదిలేస్తాడు. అయితే పంచాయతీ పెట్టించిన వ్యక్తులు పంచాయతీ జరిగినన్ని రోజులు కులస్తులు తాగడానికి, తినడానికి ఖర్చులు భరించాలి. కనీసం మూడు నుండి వారం రోజులు పంచాయతీ నడుస్తుంది.



కుల పెద్ద మాట వినని వారిని కులం నుండి బహిష్కరిస్తారు. అలా బహిష్కరణ కావడమనేది హత్య చేయబడిన దానితో సమానమే గాక బతకడం కష్టం కూడా. అందుకే ఎవరైనా కుల కట్టుబాటును శిరసావహించాల్సిందే.

కుల పెద్ద మాట వినని వారిని కులం నుండి బహిష్కరిస్తారు. అలా బహిష్కరణ కావడమనేది హత్య చేయబడిన దానితో సమానమే గాక బతకడం కష్టం కూడా. అందుకే ఎవరైనా కుల కట్టుబాటును శిరసావహించాల్సిందే.

కుల పెద్ద తనకు అవకాశం ఇచ్చేసరికి లచ్చిగాడికి ఒక రకమైన సంతోషం కలిగింది.

"సెప్పేదేముంది. నేను బతకడానికి సంవత్సరం పాటు పట్నం ఎళ్ళొచ్చేసరికి ఈ లంజెది వాడిని ఉంచుకుంది. అందుకే దీన్ని వదిలించుకోవాలన్నా" అంటు లచ్చిగాడు దూరంగా నిలబడ్డ సోములును చూపాడు.

"ఇన్నావే. నువు లంజతనం సేసావని నీ మొగుడు సెబుతున్నాడు. ఏమంటావ్?" అంటూ జంగాలు సాలమ్మను ప్రశ్నించాడు.

"నేను తప్పు సేయలేదంటే ఎవరూ ఇనిపించుకోవడం లేదు. వాడే మునుపటేడు పక్క ఊరి మన కులం దాన్ని పట్నానికి లేపకపోయాడు. మయ్యి, మన్న దోలాడ్డానికి బోయి వాన్ని పట్టుకొచ్చిర్రు. నాటి నుంచి దినాం నన్ను మయ్య దగ్గర, మన్న దగ్గర డబ్బులు తెమ్మని వాడు నన్ను బాదుతుండు. అది సూసి మన్న వాని సితకబాదిండు. నన్ను వదిలించుకోవడానికి వాడు నాకు మా మేనమామ కొడుకు సోములుతో లేని రంకు కట్టి పంచాయతీ పెట్టిండు. నేను ఏ పాపం ఎరుగా. నన్ను అట్ట అన్నోళ్ళు అట్టనే నాశనమైపొవ్వాల. నేను తప్పు సేస్తె నేనట్లనే నాశనమైపోతా" అంటూ నేలకు వంగి దోసెడు మట్టి తీసి మొగుడివైపు, వాడికి మద్దతిచ్చే వారివైపు పోసింది.

"నీ మాటే నిజమనుకుందామే. నువు కాలుతున్న ఆ నూనెలోని ఉంగరం తియ్. సేతులు కాలకపోతే నువ్వు సెప్పిందే సత్తెం. సేతులు కాలితే వాడు సెప్పేది సత్తెం. వాడు నిన్ను వదిలేస్తాడు. నువు వాడితో కాపురం సేయాలంటే జరిమానా చెల్లించి వాడు సెప్పినట్లు పడుండాలి" అంటూ జంగాలు చట్టాన్ని విడమరచి చెప్పాడు.

ఆ మాటలు విన్న సాలమ్మకు ఒళ్ళు జలదరించి, భయమేసింది.

"దానిలో నే సేతులు పెట్టను" అంటూ ఆమె అడుగు వెనక్కి వేసింది.

"అయితే తప్పొప్పుకో. అదిగో పోయిన పంచాయతీలో ఆ సిత్రాంగి కాలే గడ్డపారను పట్టుకోకుండానే తప్పొప్పుకుంది. జరిమానా సెల్లించి మొగుడితో కాపురం సేనుకుంటుంది. నువు తప్పొప్పుకుంటే ఆ లచ్చిగాడితోనే కాపురం సేసుకుందువు" అంటూ ఒక పెద్దమనిషి చిత్రాంగిని చూపిస్తూ సలహా ఇచ్చాడు.

చిత్రాంగి తన తప్పును ఎందుకు ఒప్పుకుందో సాలమ్మకు తెలుసు.

చిత్రాంగి కంటే ముందు పోచమ్మ మీద లంజెతనం మోపబడితే ఆమెను కాలే గడ్డపారను పట్టుకోమన్నారు. పోచమ్మ దాన్ని పట్టుకోగా చేతులు బాగా కాలాయి. దానితో ఆమె కొద్ది రోజులకు చనిపోయింది. ఇది తెలిసిన చిత్రాంగి బతుకు మీద తీపిపై తప్పొప్పుకుని జరిమానా కట్టింది. వాస్తవానికి చిత్రాంగికి చాలామందితో అక్రమ సంబంధం ఉంది. అందుకే దానికి ఆ పేరు వచ్చింది. ఆమె అసలు పేరు శాంతమ్మ.

"ఇపుడు తను ఏమి చేయాలా?" అని సాలమ్మ ఆలోచించసాగింది.

"ఏందే లంజె ఆలోచిస్తున్నావు? ఉంగరం తీయమని పెద్ద మనిషి సెబుతుంటే సెవులు వినరాదంలే?" అని తిడుతూ లచ్చిగాడు పెళ్ళాన్ని ముందుకు తోశాడు.

కిందపడబోయిన సాలమ్మ నిలదొక్కుకొని మొగుడి వైపు తీక్షణంగా చూసింది. ఆ చూపుకు శక్తి వుంటే వాడు కాలి బూడిద కావలసినవాడు.

"ఒరేయ్! నువు నీతిమంతుడివైతే నువు ముందు ఉంగరం తీయ్. ఆ తరువాత నే తీస్తా. ఎవరు లంజతనం సేసిర్రో తేలుతాది" అంటూ ఆమె గద్దించింది.

ఆమెలోని ఎదిరింపుకు మొగుడు అదిరిపడ్డాడు. అక్కడి వారంతా అవాక్కయ్యారు. కొందరు ఆడవాళ్ళు 'ఇదెక్కడి చోద్యం' అన్నట్టుగా ముక్కు మీద వేలేసుకున్నారు.

"వాడికి ఎదురు తిరుగుతావే. వాడు మగోడు. రామాయణంలో సీతమ్మోరికి అగ్గి పరీచ్ఛ పెట్టారుగాని రాములోరికి పెట్టలేదు. ఆడోళ్ళు నీతిగా ఉండాలి. అందుకే ఆడోళ్ళకే ఈ పరీచ్ఛలు... ఏంటీ! గుడ్లప్పగించి సూస్తున్నావు. ఉంగరం తీస్తావా, తప్పొప్పుకుంటావా?" అంటూ మరో యాభయ్యేళ్ళ సైదులు గదమాయించాడు.

నీతిపై ఒక మొగవాని ఆరోపణతో కులపోళ్ళందరూ గద్దల్లా తనను తరుముతున్నట్టుంది సాలమ్మకు. ఆమె ఏకాకి. తన గురించి స్వంత అయ్య, అన్న తప్ప ఆలోచించే నాథుడే లేదు. ఇది శీలానికి సంబంధించిన పరీక్ష. తరతరాలుగా తమ కులంలో జరుగుతున్న అక్రమ కట్టుబాటు, ఆచారం. ఎలాగైనా దీనిని ఎదుర్కోవాలనుకుంది.



ఆమె శ్వాస భారంగా నడుస్తుంది.

"అయ్యలారా! నా మాట కాస్త ఇనండి. నీతి గీతి అనేది ఆడోళ్ళకే అయితే, మీ పెళ్ళాలు ఏ తప్పు సేయనోళ్ళేగా. ఆళ్ళను ఒక్కసారి దానిలో సేతులు ముంచమనండి. ఆ వెంటనే నే దానిలోని ఉంగరం తీస్తా" అంటూ పొయ్యి వైపు చూపిస్తూ సాలమ్మ గట్టిగా అరిచింది.

సాలమ్మలోని తెగువకు, పెట్టిన తిరకాసుకు మగవాళ్ళ పాదాల కింద భూమి కంపించినట్లయింది. ఆడవాళ్ళ మెదళ్ళపై పట్టిన మట్టిని పిసికినట్లయింది.

కుల కట్టుబాట్లపైన, మూఢాచారాలపైనా ఆమె సవాలు విసరినట్లయింది.

"నేను ఏ తప్పూ సేయనిదాన్ని నాకేంటి బయం. నేను సేతులు పెట్టి తీస్తాన్లే అంటూ ఉప్పలమ్మ సాలమ్మకు సవాలు విసురుతూ చీర దోపుకుని జడ ముడేసుకుంటూ ముందుకొచ్చింది.

ఉప్పలమ్మ మొగుడు పరుగున అడ్డొచ్చి

"నీ మీద నేను తప్పేయలేదు. ఆ ముండ నోటికొచ్చింది కూస్తే మాత్రం నువ్వు బర్రున రావడమేనా?" అంటు ఆమెను వెనక్కి నెట్టసాగాడు.

"నీకేం బయం మావా! నేనే కాదు. ఆ చిత్రాంగి తప్ప ఇకడున్న ఏ ఆడది తప్పు సేయలేదు. అందుకే కాలే గడ్డపారను పట్టుకున్నా, కాలే నూనెలోంచి ఉంగరం తీసినా మాకు కాలదు... నా మానాన్ని పరీచ్చించి సూపుతాను. దానికి బయపడేదేంటి. అడ్డు తొలుగు" అంటూ ఉప్పలమ్మ మొగుడ్ని పక్కకు నెట్టజూసింది.

"మాకు మాత్రం బయమా! మేమూ పతీతులమే. కావాలంటే మేమూ ఏలు ముంచుతాం" అంటూ మిగతా ఆడోళ్ళు ముందుకు రాబోయారు.

ఇదంతా చూస్తున్న జంగాలుకు తన పెద్దరికానికే ధిక్కారమనుకున్నాడు. ఏనాడూ లేని తిరుగుబాటు ఆడోళ్ళలో రావడం చూసిన అతనికి దాన్ని ఆపడం సాధ్యం కాదనుకున్నాడు. ఇది ఛాలెంజ్‌కు దారితీస్తుందనుకున్నాడు..

"ఆగండి. ఇది నా ఆగ్న" అంటూ జంగాలు అరిచాడు.

అందరూ ఆగి అతని వైపు చూశారు. పెద్ద మనిషికి కోపమొచ్చిందనుకున్నారు. సాలమ్మకు సిచ్ఛ తప్పదనుకున్నారు. ఇక ఆడవాళ్ళను మొగుళ్లు ఏమంటారో? ఆడవాళ్ళందరిలో ఒకటే గుబులు.

"సాలమ్మ సెప్పిందీ సత్యమే. కాని, మనం ఆ పని సేయలేము. మన ఆడోళ్ళకు బయముండాలనే ఎనకటి నుండి ఈ పరీచ్ఛలు పెడుతున్నాం. ఈ రోజు ఇది ఎదిరించి మన కళ్ళు తెరిపించింది. ఈ రోజు నుండి ఈ పరీచ్ఛలను తీసేస్తున్నాను."

జంగలు అనిన ఆ మాటలకు ఆడోళ్ళందరు చప్పట్లు కొట్టారు. మగోళ్ళ ముఖాలు మాట్లాడినట్లయ్యాయి.

జంగాలు తన మాటలను కొనసాగించాడు.

"తప్పనేది మగోడు సేసినా, ఆడది సేసినా పంచాయతీ పెట్టి సాచ్ఛాలతో ఇచారిద్దాం. ఇకపోతే, ఇపుడు ఈ లచ్చిగాడు సాలమ్మను వదిలించుకోవాలని దానిపై తప్పును నెట్టాడని తెలుస్తుంది. కాని, వాడు దానిని ఏలుకోవాల్సిందే. ఈ తప్పుకు గాను మన కులపోల్లందరికి ఒక్కోరికి సీసాడు సారా తాగించాలని సిచ్చ ఏస్తున్నా" అని జంగాలు తీర్పిచ్చి అక్కడ నుండి లేచి కండువా దులిపాడు.

ఆ తీర్పు ఆ కులస్తులలో చారిత్రాత్మకమైంది.

"ఒసే సాలమ్మ!" అంటూ ఆడోళ్ళు సాలమ్మను ఎత్తుకున్నారు.

చిత్రాలు సాలమ్మను కౌగిలించుకొని, "సెల్లీ! మంచి పని సేసినవే. తప్పు సేసినా సేయకున్నా నిప్పు కాలుద్దనే నిజం ఆ పెద్దమనిషికి తెలుసు. కాని, అది తెలియని ఎంతోమంది ఆడోళ్ళు నేను కూడా పరీచ్ఛలో నిలబడలేక చేసిన తప్పును ఒప్పుకున్నాను. ఏ తప్పు సేయని నీకూ నిప్పు కాలుద్దనే విషయం తెలియకున్నా తెగించడంతో అసలు సంగతి బయటపడింది. దానిలో చేతులు పెట్టకుండా మంచి పని సేసినవ్. మన ఆడోళ్ళను కాపాడినవ్" అంటూ ఆమె వీపును సవరించింది.

లచ్చిగాడు తప్పు చేసిన వాడిలా తల దించుకుని మెల్లగా అక్కడ నుండి కదిలాడు.

సాలమ్మ కళ్ళలో నీళ్ళు చిప్పిల్లుతుండగా దగ్గరికొచ్చిన నాలుగేళ్ళ కొడుకును గట్టిగా గుండెలకు హత్తుకుంది.

**సెల్ : 7569297047**

# నందనవనం

- తాతోలు దుర్గాచారి

సెల్ : 9676357648



సువిశాల సుందర జగతిలో
జీవన గతి కరువై
దిక్కుతోచని స్థితిలో మనుగడ కోసం
మనిషి వేదన పడ్తూ...
నిత్య బ్రతుకు పోరుతో
ప్రకృతి ఒడిలో పెరుగుతూనే
నిరంకుశుడై - ఆ ప్రకృతినే ఉపేక్షిస్తున్నాడు
స్వార్థంతో...విచక్షణా రహితుడై..
వినాశనం సృష్టిస్తున్నాడు..
నిత్య వసంత పరిమళ శోభితమైన... ఈ
ప్రకృతి అందాలనే విచ్ఛిన్నం చేస్తున్నాడు
మనిషి గుండె గదిలో స్వార్థ చింతన పెరిగి
మానవత్వం కనుమరుగై...
ఆర్ధ్రత అణువంతైనా మిగలక
అమానుషం ప్రజ్వరిల్లుతోంది..
సహజసిద్ధ ప్రసాదమైన...
మావిచిగురు ఎండిమాడిపోతోంది..
వేపపూవు... విసిగి వేసారి పోతోంది...
కోయిల కుహూస్వరం గ్లోబల్ సైరన్ మోతలో
కూనిరాగమైపోయింది
పచ్చదనం కాసింతైనా కానరాక... వనమంతా
మూగగా ప్రశ్నిస్తోంది...
మా'నవ' నాగరికతా విషవలయంలో సైతం
నవ వసంతం నిత్యనూతనంగా...
కొత్త ఆమనిగా... సరికొత్త 'నందన'వనంగా..
మనముందు సాక్షాత్కరించాలని...
శుభం పలకాలనీ...
సహృదయంతో... స్వాగతిద్దాం...!

---

# ఆత్మాహుతి ఒకసారి కాదు...

- హరిప్రసాద్ లచ్చిరెడ్డి



దోపిడి ఎలా జరుగుతుందో తెలియదు...
తల్లిలాంటి పల్లె నుండి వల (స)
వేయబడటం తప్పనిసరి!
ఉపాధి ఉనికికే -
ఉన్నతికెపుడూ ఊహించనంత దూరం...!
సమాజంలోంచి నిన్ను రేషనలైజ్ చేసే రేషన్ కార్డు
ఆంబోతు కచ్చేసినట్టు "ఆధార్" ముద్ర!
అయినా, నిన్ను నువ్వు చెత్తబుట్టలో వెతుక్కోక తప్పదు
పున్నమినాటికి నీకు జీతమొచ్చినా
సరుకుల సంచి నిండా అమావాస్య చీకటి ముద్ద!
అశాంతి నిన్ను వీడని నీడ
కారణమైన వెలుగుని గమనించావా... అది
నీ బతుకునే కాల్చేస్తున్న అగ్గి!
నీ కూట్లో కొడుతున్న బుగ్గి!!
వాడెప్పుడూ ఏలిక
వాడికెక్కడుంటుంది నిన్ను చూసే తీరిక!
నువ్వెన్నిసార్లు ఆత్మహత్య చేసుకున్నా -
నీ ఆత్మా చావదు -
నీ ఆశా చావదు -
ఎందుకంటే నీవెప్పుడో వాడి వాగ్దానానికి బానిసవు
యిన్నీ చూస్తున్నా
ఉడుకునెత్తురు
పిడికిలి బిగువుకి ఉప్పొంగినా
నేతల చెక్కిళ్ళపై చెప్పుల ధూళి
వీరగంధం పోసినట్లే ఉంది
ప్రజాస్వామ్యంలో
వ్యక్తిగత దాడులు తగవని పెద్దల మాట
వ్యక్తిగత దాడుల కోసమే
ప్రజాస్వామ్యాన్ని
అడ్డం పెట్టుకోవటం
రాజకీయుల చెలగాటం
అయినప్పటికీ
భారత ప్రజాస్వామ్యానికి జేజేలు పలక్కా తప్పదు

# దేశం, అస్తిత్వం - సమాజం, సాహిత్యం

- డా॥ అద్దేపల్లి రామమోహనరావు




ఖమ్మం జనకవనంలో ప్రారంభోపన్యాసం చేస్తున్న అద్దేపల్లి రామమోహనరావు

***ఆర్థికంగా, రాజకీయంగా మరో దేశానికి లొంగిపోయిన దేశం, సాంస్కృతికంగా కూడా తనని తాను సర్వనాశనం చేసుకుంటుంది. ప్రస్తుతం భారతదేశం ఈ స్థితిలోనే ఉంది. ప్రపంచీకరణ పేరున, సామ్రాజ్యవాద దేశాలకు పూర్తిగా బానిసగా మారిన, మారుతున్న, మారబోతున్న దేశం మన దేశం. 1990ల నుంచి యిది ఎంత పటిష్టమైన పర వ్యూహాలతో అమలు జరుగుతోందంటే ప్రజలకు ఎదురు తిరిగే అవకాశం కూడా లేనంతగా మన వ్యవస్థను బిగించేశారు.***

ఒక అత్యంత పటిష్టమైన అస్తిత్వం వ్యక్తికి ఎంత అవసరమో, దేశానికీ అంతే అవసరం. ఏ దేశమైనా, తన మౌలికమైన అస్తిత్వాన్ని కాపాడుకుంటూ, తనలోని లోపాల్ని తన ప్రగతికి అనుకూలంగా సవరించుకుంటూ, మరే దేశానికీ లొంగిపోకుండా ముందుకు పోయినప్పుడే, దాన్ని స్వతంత్ర దేశమని చెప్పగలం. అదే దేశానికి సంబంధించిన సార్వభౌమత్వాన్ని నిలుపుకోవడం అవుతుంది. ఆర్థికంగా, రాజకీయంగా మరో దేశానికి లొంగిపోయిన దేశం, సాంస్కృతికంగా కూడా తనని తాను సర్వనాశనం చేసుకుంటుంది. ప్రస్తుతం భారతదేశం ఈ స్థితిలోనే ఉంది. ప్రపంచీకరణ పేరున, సామ్రాజ్యవాద దేశాలకు పూర్తిగా బానిసగా మారిన, మారుతున్న, మారబోతున్న దేశం మన దేశం. 1990ల నుంచి యిది ఎంత పటిష్టమైన పర వ్యూహాలతో అమలు జరుగుతోందంటే ప్రజలకు ఎదురు తిరిగే అవకాశం కూడా లేనంతగా మన వ్యవస్థను బిగించేశారు. ఒకవంక, క్రమంగా అందరూ దిగజారిపోయే ధనవాంఛను, లైంగిక వాంఛను, తిరుగులేని వ్యామోహ రూపంగా పెంచేస్తున్నారు. మరోవంక అన్నీ ప్రైవేటీకరణ చేస్తూ, యాజమాన్యాన్ని ఏ విషయంలోనూ ప్రశ్నించే వీలు లేకుండా చేస్తున్నారు. చివరిదాకా పోరాడే వారిని భౌతికంగా కూడా లేకుండా చేస్తున్నారు. ఇది అమెరికా సామ్రాజ్యవాదానికి లొంగిపోవడం వల్ల జరుగుతున్న అనర్థం. వారి పెట్టుబడిదారీ విధానాన్ని నూటికి నూరుపాళ్ళు అమలు జరపడానికి అంగీకరించిన పాలక వర్గాల దుర్మార్గం.

భవిష్యత్తును దర్శించగల మహాత్ములు ఎప్పుడూ ఉంటారు. వారి మాటల్ని పాటించకపోవడమే సర్వ పతనాలకీ కారణం. స్వార్థం వేయిపడగలెత్తి విషం కక్కుతున్నప్పుడు ఏ పెద్దల మాటలూ, ఏ సిద్ధాంతకర్తల హెచ్చరికలూ పాలక వర్గాల చెవులకెక్కవు. దీన్నే ఆధునిక సామ్రాజ్యవాద వర్గ మేధావులు పోస్ట్ మోడరన్ సొసైటీ అనే ముద్దు పేరు పెట్టి, ఆధునికత మీద వ్యామోహమున్న ఆంగ్ల మానస పుత్రుల మెదళ్ళకు చెదలు పట్టేటట్లు చేస్తున్నారు. ఇప్పుడు భారతదేశ పరిస్థితిని ప్రతిబింబించే అద్భుతమైన విశ్లేషణలు. ఇంతకు ముందు ఎవరైనా చేశారా అని ఆలోచిస్తే, ముందుగా చెప్పవలసిన మహామేధావి మార్క్స్ మాత్రమే. ఆయన మాటలు ఎంతగా భవిష్యత్, పెట్టుబడిదారీ సమాజ దుర్లక్షణాలను విశ్లేషించాయో గమనిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ఒకచోట ఆయన ఇలా అన్నారు. ఈ మాటల్లోని ప్రతి అక్షరమూ పుస్తకమంతగా వ్యాఖ్యానం చేసే అవకాశం ఉంది.

'ప్రపంచ మార్కెట్‌ని, దోపిడీ చేయడం చేత పెట్టుబడిదారీ వర్గం, ప్రతి దేశంలోని, ఉత్పత్తి వినియోగాలకి, ప్రపంచ వ్యాప్తమైన స్వభావాన్ని యిచ్చింది. ప్రతీఘాత శక్తులు నిరాశపడేలా, అది నిలబడిన జాతీయ, ఆధారభూమి నుండి, పరిశ్రమల పాదాల అడుగు నుంచి, తనను లాగేసుకుంది. ప్రాచీన కాలం నుంచి స్థిరపడిన జాతీయ పరిశ్రమలన్నీ ధ్వంసం చేయబడినై లేదా ప్రతి రోజూ ధ్వంసం చేయబడుతున్నై. అవి కొత్త పరిశ్రమల చేత తరిమి వెయ్యబడినై. వాటి ప్రవేశం, అన్ని నాగరిక జాతులకీ జీవన్మరణ సమస్య అవుతుంది. పరిశ్రమలకింక దేశీయ ముడిపదార్థాలు పనిచేయవు. అవి మారుమూల కోణాల్నించి గ్రహించబడతై. పరిశ్రమల ఉత్పత్తులు, స్వస్థలంలో మాత్రమే కాదు, గ్లోబులోని అన్ని ప్రాంతాల్లో వినియోగింపబడతై. ఆ దేశంలో తయారైన వస్తువుల చేత కలిగే పూర్వపు కోరికల స్థానే, కొత్త కోరికలు బయల్దేరతై. వాటి సంతృప్తికి, సుదూర ప్రదేశాల వాతావరణాలు,

ఉత్పత్తులు అవసరమౌతై. వస్తూత్పత్తి మాత్రమే కాదు, మేధోత్పత్తి విషయంలో కూడా ప్రతి దిశలోనూ సాంగత్యం ఏర్పడుతుంది. ప్రత్యేక దేశాల మేధా సృజనలు సాధరణీకరణ చెందిన సంపదలు ఔతై. జాతీయమైన ఏకపక్ష స్వభావమూ, పరిమితత్వమూ, ఇంకా యింకా అసాధ్యమైపోయి, జాతీయమైన, స్థానికమైన అనేక సాహిత్యాలు, ప్రపంచ సాహిత్యంగా అవతరిస్తై!'

దేశీయత, జాతీయత అని గొంతు చించుకునే వారందరూ, మార్క్స్ మాటల్ని జాగ్రత్తగా గమనించవలసి వుంది. పై మాటల్లో ప్రపంచ మార్కెట్, దోపిడీ, ప్రపంచవ్యాప్త స్వభావం, జాతీయ పరిశ్రమలు, జీవన్మరణ సమస్య, గ్లోబులోని అన్ని ప్రాంతాలు, కొత్త కోరికలు, మేధా సృజన సాధారణీకరణ, జాతీయమైన స్వభావం అసాధ్యం కావడం, ప్రపంచ సాహిత్యం – ఈ మాటల్ని వ్యాఖ్యానిస్తే, ఈనాటి మన భారతదేశ పతనమంతా కళ్ళకు కడుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ దుర్మార్గమంతా అర్థమైపోతుంది. అందుకే ప్రగతిశీల భావాలు గల వారెవరూ మార్క్స్‌ని తప్పించుకుపోవడం సాధ్యం కాదు. కేవలం ధనదాహమే ధ్యేయంగా గల భారీ పరిశ్రమల పురోగమనం, ఎంతమంది ప్రాణాలు తీస్తుందో, ఎన్ని భూముల్ని మింగేసి, కొన్ని వేల గ్రామాల ప్రశాంత జీవనాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ, స్వయం పోషకత్వాన్నీ ధ్వంసం చేస్తోందో, ఎంత ప్రమాదకరమైన పంచభూతాల కాలుష్యాన్ని రోజు రోజుకూ పెంచి జీవితాన్ని దుర్భరం చేసి, అనారోగ్యాలకీ, మరణాలకీ కారణమవుతుందో కళ్ళముందు కనిపించే విషాద దృశ్యం. 'నాగరిక జాతులకి జీవన్మరణ సమస్య' అని మార్క్స్ చెప్పింది ఎంత భవిష్యత్ దర్శనం! సాహిత్య విషయానికి వస్తే, జాతీయ సాహిత్యాలు నశించిపోయి, ప్రపంచ సాహిత్యం మిగులుతుందనే మాట ఎంత విలువైనది! ఈ మాటలో మాతృభాషలు, భావాలు ధ్వంసం కావడమనే అర్థం యిమిడి వుంది. ఇంకా ఎన్నో ఎన్నో విషయాల్ని పొల్లుపోకుండా మార్క్స్ చెప్పగలిగాడు. అందుకే ఈనాటి సర్వ విధ్వంసాన్ని వ్యాఖ్యానించగలవారిలో మార్క్సిస్టులు ముందు వరుసలో వున్నారు.

**సాహిత్య విషయానికి వస్తే, జాతీయ సాహిత్యాలు నశించిపోయి, ప్రపంచ సాహిత్యం మిగులుతుందనే మాట ఎంత విలువైనది! ఈ మాటలో మాతృభాషలు, భావాలు ధ్వంసం కావడమనే అర్థం యిమిడి వుంది. ఇంకా ఎన్నో ఎన్నో విషయాల్ని పొల్లుపోకుండా మార్క్స్ చెప్పగలిగాడు. అందుకే ఈనాటి సర్వ విధ్వంసాన్ని వ్యాఖ్యానించగలవారిలో మార్క్సిస్టులు ముందు వరుసలో వున్నారు.**

భారీ పరిశ్రమలు చేసే విధ్వంసాన్ని గూర్చి, తెల్లవారి లేస్తే గాంధీని అదే పనిగా స్మరించే పాలకవర్గాలకి ఏమీ పట్టలేదు. గాంధీయే భారీ పరిశ్రమల్ని గూర్చి ఈ విధంగా చెప్పారు.

'యంత్రాలు ఉండటానికి వచ్చాయి. అయితే వీటికొక స్థానం ఉండాలి. అవసరమైన మానవ శ్రమను కూడా తొలగించి, ఆ స్థానంలో యంత్రాలను ప్రవేశపెట్టకూడదు. అభివృద్ధిపరచిన నాగలి చాలా మంచిది. అయితే ఏదో ఒకరకంగా ఒక్క మనిషి భారతదేశంలోని భూమి మొత్తాన్ని దున్నే యంత్రం ఏదైనా వచ్చిందనుకోండి. దాని ఫలితంగా ఇక లక్షలాది మంది నిరుద్యోగులుగా మారి, చేయడానికి పనిలేక, అర్థాకలితో అలమటిస్తూ, పనికిరాని వాళ్ళుగా తయారవుతారు. ఇప్పటికే ఆ విధంగా చాలామంది తయారయ్యారు. భవిష్యత్తులో మరింతమంది ఆ విధంగా తయారయ్యే ప్రమాదం పొంచి ఉంది.

మరోచోట గాంధీని 'మీరు అన్ని యంత్రాలను వ్యతిరేకిస్తున్నారా?' అని అడిగితే ఆయన ఇలా జవాబు చెప్పారు.

'కాదనే నా గట్టి సమాధానం. అయితే విచక్షణా రహితంగా దాన్ని ఉపయోగించడానికి నేను వ్యతిరేకం. పైపైకి కనిపించే యంత్ర విజయాలను గాంచి, విభ్రాంతుణ్ణి కావడానికి నేను సిద్ధంగా లేను. వినాశనానికి దారితీసే అన్ని యంత్రాలకూ నేను నిస్సందేహంగా వ్యతిరేకినే. అయితే మానవ శ్రమను పొదుపు చేసి, లక్షలాది కుటీర పరిశ్రమల భారాన్ని తేలికపరచగల సరళమైన చిన్న వస్తువులు తయారు చేసే యంత్రాలను నేను ఆహ్వానిస్తున్నాను.'

అయితే శ్రమైక జీవన సౌందర్యాన్ని పూర్తిగా నాశనం చేసి, ప్రజలు చచ్చినా సరే, భారీ యంత్రాల మార్కెట్‌లో బహుళ జాతుల్ని బలిసేట్టుగా చేయడమే మా లక్ష్యం అనే పాలక వర్గాలకి గాంధీగారి మాటలు తలకెక్కుతాయా? 'ప్రపంచ కార్మికులారా! ఏకంకండి' అని మార్క్స్ అంటే 'ప్రపంచ కోటీశ్వరులారా! ఏకంకండి' అని ఈనాటి ప్రభుత్వ నినాదమయింది. గాంధీగారి వారసులు గాంధారీ పుత్రులని తిలక్ అన్నది అందుకే.

తెలుగు సాహిత్యంలో గురజాడను మించిన దార్శనికుడు లేడు. ఇప్పుడు మన దేశం కొట్టుకుపోతున్న పాశ్చాత్య వ్యామోహం గురించి గురజాడ చెప్పిన మాటలు ఎంత వాస్తవికమో గమనించండి.

'పాశ్చాత్య నాగరికత కొన్ని అంధ విశ్వాసములను పోగొట్టుతున్నమాట యధార్థమే అయినప్పటికీ, అది ప్రబోధించే స్వాతంత్ర్యము సాంఘిక ప్రగతి శూన్యమైనది. ఇది సంపూర్ణ స్వాతంత్రం కాదు. నామమాత్రమైనది. ఇది అన్యులకు చోటివ్వదు. ఇటువంటి నాగరికత మనుజుల అవలక్షణములకు, అస్థిరత్వమునకు, దోషములకు గురిచేసి, అక్కడకు తీసుకుపోయి దిగవిడువక తప్పదు. ఈ అవలక్షణములను, దోషములను, చెడుగులను, ధోరణిని దిగ్విజయముగా ఎదిరించి, పోరాడుట నేటి ప్రప్రథమ సమస్య.'

ఆంగ్ల మానసపుత్రుడుగా గురజాడను భావించేవారు, పై మాటలను గమనించాలి. పాశ్చాత్య నాగరికత ప్రబోధించే స్వాతంత్ర్యము సాంఘిక ప్రగతిశూన్యమైనది. ఇది అన్యులకు చోటివ్వదు అనే అవగాహన, వందేళ్ళకు ముందు, అంత గట్టిగా చెప్పడం ఎంత ఆశ్చర్యకరమైన దర్శనం! ఏకశిలా సదృశ్యమైన నాగరికతకు దారితీసే



# శివసాగర్ కన్నుమూత

మాజీ నక్సలైట్ కంభంపాటి జ్ఞాన సత్యమూర్తి (83) ఏప్రిల్ 17న తుదిశ్వాస విడిచారు. కృష్ణాజిల్లా జి. కొండూరు మండలం కందులపాడులో తన పెద్ద కుమారుడు ప్రసన్న సిద్ధార్థ నివాసంలో ఆయన మృతి చెందారు. కొంతకాలంగా ఆయన పక్షవాతం, మూత్రపిండాల వ్యాధితో బాధపడుతున్నారు. ఆయనకు భార్య ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలున్నారు. భార్య మణెమ్మ బెంగుళూరులో మనవడి వద్ద ఉంటున్నారు. పెద్ద కుమారుడు ప్రసన్న సిద్ధార్థ లారీ డ్రైవర్‌గా పనిచేస్తున్నాడు. సత్యమూర్తి 1931లో కృష్ణాజిల్లా నందివాడ మండలం కోరుకొండ శివారు శంకరంపాడులో కంభంపాటి ప్రసన్నకుమార్, మరియమ్మలకు జన్మించారు. సుదీర్ఘకాలంపాటు పలు ఉద్యమాల్లో నిర్మాణకర్తగా – వ్యూహకర్తగా సేవలందించారు. ఆయన రాసిన ఎన్నో కవితలు సినిమాల్లో పాటల రూపంలో ప్రజలను ఆకట్టుకున్నాయి. పరిటాల రవి తండ్రి కథను స్ఫూర్తిగా తీసుకుని నిర్మించిన శ్రీరాములయ్య సినిమాలో 'నీకిస్తా తమ్ముడా నీకిస్తా తమ్ముడా' అని ఆయన రాసిన గేయాన్ని స్వరపరిచిన సంగీత దర్శకుడు వందేమాతరం శ్రీనివాస్‌కు అవార్డు కూడా లభించింది. సత్యమూర్తి గుంటూరులో బిఎ చదివారు. అనంతరం ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రాజనీతి శాస్త్రంలో మాస్టర్స్ డిగ్రీ పొందారు.

సామాజిక, సాహిత్య రంగాల్లో సుదీర్ఘకాలం సృజనాత్మకంగా కృషి చేశారు. సాహిత్య రంగంలో శివసాగర్‌గా ప్రాచుర్యం పొందిన సత్యమూర్తి తుదివరకూ పేద ప్రజలు, సామాజిక న్యాయం కోసం పోరాడారు. సత్యమూర్తి కమ్యూనిస్టు పత్రికల్లో చాలాకాలం పనిచేశారు. పోరాట సాహిత్య అభివ్యక్తిలో కళాత్మకతను సాధించి ఒక ప్రత్యేక ఒరవడిని ఏర్పరచుకున్నారు. తెలుగు సాహిత్యంలో తనదైన ప్రతిభను చాటిన శివసాగర్‌కు సాహిత్య ప్రస్థానం జోహార్లర్పిస్తున్నది.

---

ఈనాటి సామ్రాజ్యవాద లక్ష్యం, పై మాటల్లో బీజప్రాయంగా ధ్వనించడం లేదూ? ఈ పరిస్థితిపై ఎదిరించి పోరాడవలెనని చెప్పిన గురజాడ, ఆనాడే ఎంత విప్లవకారుడు!

అంతేకాదు, ఈనాటి ప్రైవేటైజేషన్‌ను కూడా విద్యా విధానానికి అన్వయించి చెప్పడం మరింత ఆశ్చర్యం కలిగిస్తుంది. ఇప్పటి ప్రైవేటైజేషన్ గురించి, ఆలోచన రావడమే ఆనాడు అసంభవం కావచ్చు. కాని వ్యక్తిగతమైన లాభాన్ని ఎంత విధ్వంసకరంగా గురజాడ భావించాడో, అది ఆయన విద్యా విధానం గూర్చి చెప్పిన మాటల్లో తెలుస్తుంది. ఇది అన్ని విధాల ప్రైవేటీకరణకూ అన్వయించుకోవచ్చు.

'ప్రైవేట్ మేనేజ్‌మెంట్‌కు సంస్థలను అప్పగించడమనేది చేయరాని ఒక మహా దోషం. ఇంతకంటే హానికరమైన పని మరి ఒకటి లేదు. నగరాలలో ఉన్న పాఠశాలలు, కళాశాలలు ఎంత అవకతవకగా, బేసబబుగా నిర్వహింపబడుతున్నాయో, వాటికి అజమాయిషీ వహించే కమిటీలు ఎంత అరాచకంగా ప్రవర్తిస్తున్నాయో ఊహించలేం. కమిటీలకు ఉన్నదల్లా అహంకారం ఒకటే. బాగుపడే విధానమేదో వారింకా గ్రహించినట్టు లేదు.'

గుద్దెద్దు చేలో పడి సర్వనాశనం చేసినట్లు, ఈనాడు సర్వ రంగాల్లో ప్రైవేటీకరణ, ఎంత విధ్వంసం సృష్టిస్తుందో ఆలోచిస్తే, ఈనాటికీ గురజాడ ఎంత అవసరమో అర్థమవుతుంది.

పై విషయాలన్నీ అవగతం చేసుకుంటే ఈనాడు సాహిత్యం ఎలా ఉండాలి అనే ప్రశ్నకు సరైన సమాధానం లభిస్తుంది. ఈనాటి సాహిత్యానికి, ఇంతకు పూర్వంలేని కొత్త వస్తువు అవసరమైంది. ఇప్పుడు సామ్రాజ్యవాది ఈ దేశపు రంగును పూర్తిగా మార్చేసి, మన అస్తిత్వాన్ని చంపేసి, అందర్నీ తమలాగా రూపాంతరం చెందించే ప్రయత్నంలో ఉన్నాడు. ప్రపంచీకరణ అనేది ఇంతకుముందు ఉన్న అన్ని వాదాల్నీ బలహీనం చేసింది. ఇంతకుముందు వ్యవస్థలోని దుర్లక్షణాల్ని తొలగించుకునే ఉద్యమాల్ని నడిపితే యిప్పుడు వ్యవస్థనే సమూలంగా మార్చే ప్రపంచీకరణమై కొత్త ఉద్యమాలు నడపవలసిన తరుణం ఆసన్నమైంది. ప్రతి అంశమూ ప్రపంచీకరణ వల్ల ధ్వంసం ఔతుండటం చేత ఏ అంశాన్ని తీసుకున్నా, అందులోనే దాని వైరుధ్యం కూడా స్పష్టంగా కనిపిస్తోంది. ఈ వ్యవస్థ బాగుందనీ, దేశం ముందుకు పోతోందనీ మూర్ఖంగా నమ్మేవాళ్ళు ఈ వైరుధ్యాన్ని గమనించలేరు. ప్రగతిశీల రచయితలు మాత్రమే వైరుధ్యాల సంఘర్షణ అవసరాన్ని అనుభూతి చెందగలరు. అందువలన రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లోని వైరుధ్యాలన్నిటినీ రచయితలు అధ్యయనం చేసి గ్రహించాలి. దానికి రచనా ప్రావీణ్యాన్ని జోడించాలి. అటువంటి సాహిత్యం ప్రజల్ని, ప్రస్తుత వైరుధ్యాల్ని అవగాహన చేసుకునేటట్లు చేస్తుంది. లేకపోతే, ఏది జరిగినా, వ్యక్తుల దోషంగానే భావించడం సాధారణమవుతుంది. వ్యవస్థను ధ్వంసం చేసి, వ్యక్తుల్ని నిందించడం పెట్టుబడిదారీ సమాజ లక్షణం. వ్యవస్థను బాగుచేసి, వ్యక్తుల్ని ఉన్నతులుగా చేయడం సామ్రాజ్యవాద సమాజ లక్షణం. అటువంటి వ్యవస్థను నిర్మించడానికి, ప్రేరణ నందించడానికి రచయితలు మాత్రమే సమర్థులు. ఆ బాధ్యతను ప్రగతిశీల రచయితలందరూ స్వీకరించినప్పుడే భవిష్యత్ సమాజం సంతృప్తికరంగా మారుతుంది.

**(సాహితీ స్రవంతి ఆధ్వర్యాన ఖమ్మంలో నిర్వహించిన 'జనకవనం'లో చేసిన ప్రారంభ ప్రసంగం)**



# కోకిల కొత్తపాట

- జంధ్యాల రఘుబాబు

కూయనంతవరకూ
కాకికీ కోకిలకీ
తేడా తెలియదు

కోకిల కూడా
తొందరపడకూడదు
తను పాడినంతనే
వసంతం రాదు మరి!

అన్ని చివురులూ రుచిగా ఉండవని
వేపచెట్టు చెప్పింది కోకిల చిన్నారికి
తానే అందుకు నిదర్శనమంది

కలిపితే
పులుపు చేదు తీపి వగరు
ఇలా అన్నీ కలిసే వుంటాయి

లేదంటే విడిగా వుంటాయి
వేపమాత చెప్పింది

చేదైనా సరే తింటూ వుంటే
తీపిగా మారుతుందట కదా!
కోకిల పాప ప్రశ్నించింది
అది మారేవరకూ చేదునే తింటావా

తీపి విడిగా కూడా దొరుకుతుంది
ఆస్వాదించు
వేపతల్లి సలహా ఇచ్చింది

షడ్రుచుల జీవితం
అనుభవిస్తే కాని అర్థం కాదులే
అని
చిన్నారి కోకిల ఎగిరిపోయింది

దానికి లోకమంతా
ఇప్పుడు కొత్తగా కనిపిస్తోంది
తాను ఎప్పుడు పాడాలో తెలిసిందని
ఒకింత గర్వపడింది

నిన్ను మించిన తీపి
ఈ ప్రపంచంలో లేదేమో
అది నీ మాటల్లోనే వుంది
చెబుతూ వెళ్ళింది వేపతో 'కొత్త కోకిల'

---

# స్వాంతన గీతం అనే రీఛార్జ్ ప్రాసెస్

- మామిడి హరికృష్ణ
సెల్ : 9908844222

అక్కడెక్కడో
నీ ప్రమేయం లేకుండానే
ఓ అల్పపీడన ద్రోణి విరుచుకుపడ్తుంది



ఏ వేళప్పుడో
నీకు చెప్పా పెట్టకుండానే
ఏ గాలిదుమారమో ఉక్కిరి బిక్కిరి చేస్తుంది

ఎవరి వల్లో
నీ ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండానే
ఏ వంచనల వడగాలులో
నిన్ను ఊపిరి సలపనీయకుండా చేస్తాయ్

అప్పటిదాకా
నవ్వుల నదిలా - పరువపు జింకలా
పరుగులెత్తి గంతులేసిన నువ్వు...
పువ్వుల జడిలా - కోయిల పాటలా
కురిసి గళమెత్తిన నువ్వు
ఒక్కసారిగా -

అంతరంగ సుడిగుండం అవుతావ్
అంతర్ముఖీన సునామీ అవుతావ్
వెక్కిళ్ళ గద్గద స్వరానివవుతావ్
గుండె సముద్రాన్ని ఆవిరిగా మార్చి
కంటి మేఘాలలోంచి
అశ్రువర్ణాలను ధారగా కురిపిస్తావ్

చేమంతి తోటలను పూయించిన చెంపలపై
కన్నీటి ఊటల్ని పుట్టిస్తావ్
ఇన్నాళ్ళుగా -
అందరి కోసమూ
చేతుల్తో నడిచి - కాళ్ళతో ఎగిరి
ఎన్నెన్నో గుండె కోతలకు
నీ హృదయాన్ని అడ్డుగా వేసి
అసాధ్యాలను సాధ్యం చేసిన నువ్వు

నీ కోసం నడవాల్సిన ఈ క్షణాన
నీ కోసం పిడికిలి బిగించాల్సిన ఈ నిమిషాన
దిగాలుగా దిక్కులు చూస్తూ
నిస్సహాయంగా చేతులెత్తేసి
ఇన్ని వేల హృదయాలలో
ఒక్క ఆత్మీయ స్పర్శ కోసం
కళ్ళల్లో వత్తులు వేసుకుని వెదుకుతుంటావ్

కానీ, నా బంగారుకొండా...
నీ చుట్టూ అల్లుకుని - నీ గుండె చుట్టూ విస్తరించి
నిన్ను నిరంతరం భద్రంగా పొదివి పట్టుకున్న
చేతులు ఎవరివో గుర్తించావా?
వాళ్ళంతా జ్యోతులుగా చేసుకుని
నిన్ను ప్రతీక్షణం వెలిగిస్తున్నది నీ ఆత్మేనని గమనించావా?
నీ పెదవుల చెట్టుపై
చిర్నవ్వుల పూలను పూయించే ప్రయత్నం చేస్తున్న
తోటమాలి నీ ఆత్మవిశ్వాసమే అని గుర్తించావా?

అందుకే ప్రియా -
ఓడిపోకూడదన్న కసిని - గెలిచి నిలవాలన్న ఆశని
మళ్ళీ తట్టిలేపు..
నిటారుగా ఎగసి
ఈ లోకానికి దారి చూపు...


ఆవంత్స సోమసుందర్

# సినీవాలికి ఆముఖం

- డాక్టర్ ఆవంత్స సోమసుందర్

(గత నెల తరువాయి)

"తొలి కాంత మలికాంత ముఖాన్ని భాష పండించింది. సన్నగా, పట్టుకొంది చేయి. ఈ స్పర్శలో కొంత ఓదార్పు దొరికింది. మనస్సులోని బరువు తీర్చుకునేందుకు నీ కనులు కావిరి బరువు తగ్గించడానికి కలల పడవల మీద పోయి చేరుకుందామద్దరికి" అని పరి పరి విధాల చింత చెంది, ఈ చీకటిలోకే వలసపోదాం, జీవితాల నదులలోకి వెడదాం! ఎన్నటికి కురిసేను స్వాతివాన? ఎన్నటికి ఆణిముత్యాలు పడతాయి. మనస్సులోనా – మలికాంత, తొలికాంత మాటలు వినుచూ పలికింది. తన చేయి వదలించుకొనుచూ "పట్టాలి ఎవరికి వారే వంటరి బాట, పాడుకోవాలి. లోలోపల చేదుపాట" అంది!

అనుమానాలను చేతబట్టుకొని, పవమానాలు ఊతపట్టుకుని కలసిపోవాలి. స్వప్నలోకాలకి ఊతపట్టుకొని, పదపోదం స్వప్నంలోకి పదపోదాం నల్లని నరకంలోకి" అని చుట్టూ కమ్ముతున్న నైరాశ్యంలో కాస్త సౌఖ్యాన్ని, సౌకర్యాన్ని కోరుకుంటూ నిశ్చయించుకుంది.

"మన అనురాగాలను చూపెట్టేందుకు అనువైన వాడెవరూ లేక, మన అభిమానాలను ఊతపట్టుకొని, పదపోదాం స్వప్నలోకంలోకి పదపోదాం నల్లని నరకలోకానికి, అనురాగాలను చూపెట్టేందుకు మనస్తాపాన్ని ఆరవేసేందుకు మగదండలు, దండెం లేదు. అలాంటి దండం ఉండటమే కాస్త ఎత్తుకు చేరడానికి అవకాశం. అప్పుడే మనస్థాపం ఆరిపోతుంది. "కన్నీళ్ళ సిరాతో కావ్యాలను రచించేవాడు. వ్రయ్యలైన హృదయ శకలాలతో బొమ్మరిల్లు కట్టుకునేవాడు అలసిపోయిన జీవితాలతో ఆడుకునేవాడు సిపాయికి రూపాయి మేపి, అపాయాలు తెప్పించేవారు. కూర్కులో కూరుకుపోయిన కోర్కెల రథ చక్రాన్ని విరగగొట్టేవాడు. వాటికి వెల్లవేసేవాడు. పెద్ద మనిషి తరహాలోకం ఇది నిష్క్రమిద్దాం. ఇక్కడి నుండి విశ్రమిద్దాం. మృత్యువులో లోపండిన "ఆశ మీద జీవిస్తూ, శ్వాస తీసుకోవడం కష్టం"! "చూసి, చూసి మోసాలకు తలొగ్గడం, దోషాల వైపు మొగ్గడం ఎందుకు మనకు చెల్లీ పోదాం వెనక్కు మళ్ళీ" అని వారిరువురూ తమ దీనగాథ నెమరువేసుకుంటారు. ఇరువురూ ముందుగా ఏకీభవించి, బరువుగా, బాధగా పయనమయ్యారు అని వారి కథ ప్రారంభం అవుతుంది. పయనమై, పతనమై వారిరువురూ భయంగా, మెల్లగా భాషించుకొందరు. "దారిలో బోనులుంటాయి. వాటిలో పడకూడదు మనము' దారిలో ఎర్రలుంటాయి. వాటిని తినకూడదు, మనం పద పోదాం! పాతాళలోకానికి ప్రాకి!

తొలి కాంత చెంచల, మలికాంత చెలికత్తెలు అఘములు చేయటం చూసి మనవాడు సూర్యుని మనస్సు మ్రింగి అనుసరించెను. వారి ఆత్మల వెనుక ఆత్మగా, ఆశలు అవకాశం కనిపించని దారిలో అనుసరించిపోతున్నారు.. పేరుకొనిపోయింది. పాపాల సరస్సు పేరుకుని పోయింది! చెడిపోయింది మనస్సు. ఉవ్విళ్ళూరించే ఊబి ఇది. మానవుడు ఆనందలోభి. కళ్ళు తెరుచుకుని, విరుచుకుని పతనమవుతున్నవారెందరో! ఎందుకో పడుతున్నారు తలక్రిందులుగా ఇందులో! కొత్తగా వచ్చే మీరెవరు? మీరెవరు? అని ప్రశ్నించగా అతనికి వాళ్ళ మనస్సుల నుంచి సమాధానం ఒసగే..."

వాడిపోయిన పువ్వులు వీడిపోయిన జవ్వనులం... చిరిగిపోయిన చిరునవ్వులం, చెరిగిపోయిన చిరునవ్వులం చెదిరిన స్వప్నాలం'' అనుకొన్నవారల ఆత్మల నిలిపి మనవాడు బ్రతిమాలుకున్నాడు! అది స్వగతంగా చెప్పుకున్న హెచ్చరిక! తన ఆత్మకు తానే బోధించుకున్న నీతి మధ్య పడొద్దు! ఇది మునగదు. ఇది మీరు చేరరాని సరిహద్దు! వెళ్ళిపొండి!! వెనక్కి మళ్ళి నడవండి. ఈ పాపంలోకి పడవద్దు!! అగాధాల కూపంలోకి మీ చోటు ఉయ్యాల వద్ద మీరు ఒక ఇంటి నట్టింటి దీపాలు మీరెందుకు అవుతారు. పాతకాలపాలు!

అంతరాత్మ ఎంతగా బోధించినా పాదాలు పాపాల ఊబిలోకే! ఎలా లభిస్తుంది ముక్తి! ఎవడందిస్తాడు సూక్తి. ఇతగాని మాటలు ఇసుమంత నవ్వి ప్రతివచన మొసగే వయ్యారి చపల! వెతికాం వెలుగు రేఖల కోసం బతికాం మర్యాద కోసం. వెచ్చదనం కోరుకున్నాము. పచ్చగా ఉండాలనుకున్నాము.

కర్తవ్యం తోచక ఏం చేద్దామన్న అసంతృప్తి వీడక జీవులు ఇలా వేదన చెందుతారు. వేడి లోపించింది. వెలుతురు లోపించింది! ఉద్వేగంగా బతకాలని, ఉద్రేకాన్ని వెదకాలనీ, త్వరపడి నరకంలో అడుగిడి, పొరపడి అక్కడే స్థిరపడి, నగరంలోని ఇళ్ళ నుండి వెలువడి, సంకెళ్ళ నుండి విడివడి, ఫ్యాషన్లకి లోబడి ఎడారి నాగరికత బిడారుల జొరబడి కుంటికాలు ఒంటి మీద, ఒంటె గూని మూపు మీద చతికిలబడిపోతున్నాం. ఎండమావుల తియ్యని మావి కోసం పోతున్నాం.

పోగాలపు మేఘాల మీదను కాళ్ళు కూడదీసుకుందాం. అన్న ప్రయత్నంలో కొత్త బంధాలు తగులుకొంటున్నాయి. అది బంకమన్ను కాదు. కల్తీ మందు విముక్తి లభించదు. ఎక్కడ శతఘ్నులు పేలుతున్నాయి. అది తనలోనా.. బయటా?

"సంక్షోభాల నుంచి ఎంతగా బయటవడాలని ప్రయత్నించినా తన చుట్టూ పెక్కు బాధలు! చిందరవందరల మందకొడి జీవితం రుచించలేదు. సుందరతరంగా ఎక్కడో ఉందని పారిపోతున్నాం. పోతున్నాం. ఆపుతున్నారు. మిమ్మల్ని చేరుకోవడం పోనుమ్ము పుణ్యముంటుంది. మమ్మాపకు" ఆ మాటలలో ఎదురు వారి పట్టు విదుల్చుకొని వారు వెళ్ళిపోయారు. తమంత తాముగా షాపులతో, నేరస్తులతో కలిసిపోయారు. తమ పాపాలు తాము చూసుకుని, లోపల లోపల దుఃఖపడుతున్నాడు. సూర్యుడు మనవాడే వాడు లోలోపల తలుస్తున్నాడు. ఇది వినాశనానికే దారి. ఈ ట్రంకు రోడ్డు మీద లేదు స్పీడు బ్రేకరు. దగాపడిన సుందరులు కాలుజారిన సోదరులు బిగించే నడుములు తెగించి వస్తారట. బిచ్చమెత్తిన ఆలోచనల మీద సెన్సార్ కత్తిరింపులకు ఐడియాల మీద సి.ఐ.డి.లకు భావాలపై పోలీసులకు ఎదురు తిరిగె యువకులు ఎందరెందరో వస్తారిటు.

పసివాళ్ళు ముసలోళ్ళు పొడుచుకుని చస్తారు. పడుచువాళ్ళతో అంతలో వింతగా అతి వృద్ధుడొకడు గెంతేటి బాలుని కేలూడగొనుచు పాపాల సేరకు, పై నుంచి జారి చూపించ నుదుట శ్రీ సూర్యుడు చూసే వాక్యానికీ, వాక్యానికీ పేరాకి, పేరాకి ఎక్కడా అనుబంధం పొసగదు. అనేక నూతన ప్రక్రియా విశేషాలతో ఇది దేనికి చెందుతుందో ఒక్క విమర్శకుడైనా చెప్పలేదు. ఈ కావ్యం సృజన అనంతరం ఆరుద్ర కూడా చెప్పలేదు.

(ఏజ్ ఆఫ్ యాంగ్జయిటీ) అనే కావ్యం సహితంను నిర్మాణయుతంగా అవగాహన కాదు. ఏదో దూరపు సంబంధం ఆనుతూ ఉంటుంది. అందులో పాత్రలు పాత్రలు కావు. అలా అని కాకనూ పోవు. ప్రముఖంగా రెండు పాత్రల మధ్య సంభాషణలుగా కనిపిస్తాయి. 38వ పుట నుంచి 43వ పుట వరకూ కావాలని కాంప్లికేట్ చేయడం, అన్యాయాలు జఠిలం చేయడం కనిపిస్తూ ఉంటుంది. "నుదుట శ్రీ సూర్యుడు చూచీ" అన్న వాక్యం తరువాత ఒక పాత్ర రూపొంది విలాసానికి దారి ఇదేనా? కులాసాకి దారి ఇదేనా? అన్న వాక్యాలలో సంశయం పెంచుకోవడమే గాని, తీర్చుకోవడం కనిపించడంలా. సాయం తీర్చుకోవడంలో పెద్దవాడైన తాతగారు కనిపిస్తాడు. రండి, తాతగారు దాటేద్దారని నియమాలయేరు "రా కుర్రాడా ఎక్కుదాం తిరుగుబాటు ఓడ!" ఇటు ఇటు సరదా తిరుగుబాటు ఓడకి. ఇటు బాధ మరచిపోవడానికి వుందొకటే మనల్ని రక్షించగలిగేది చీకటే!

"షోకులలో సోమరిగా బ్రతుకుదాం. నిస్సారమైన మర్యాద మప్పిదాల కన్నా సారవంతమైన చెడ్డతనం మేలు" అని నవీన యుగానికి, ఒక నవీన నీతిని బోధిస్తాడు.

పదండి, సరే సరే పోదాం భలే భలే ఈ దారి నర్తనశాలకు. "ఇది యథేచ్ఛా నర్తనశాలకు"

"కుర్రాడా చెయ్యి కొంచెం ఇయ్యి – తాతయ్యా ముందడుగు వెయ్యి!" ఇట్లు మాట్లాడుతూ ఏతెంచి పోవు జట్ల జట్లను చూసి సాగె సూర్యుడు...

పోతున్నారు ఆడా, మగా, చిన్నా, పెద్ద అంతులేని పాపాల ప్రాంతాలకు అంతరాళ కరాళ గహ్వరాల పోతున్నారు.

పోతున్నారు, పోయారు. జీవితంలో ఓడిపోయారు. మంచి నుంచి వీడిపోయారు. అది విలయం నైచ్యాయానికి నిలయం భయంకర విలాస వలయం. అక్కడికి చేరుకుంటున్నారు, సాగివస్తున్నారు. విస్తారంగా వీళ్ళు, సాయంకాలపు దీర్ఘచ్ఛాయల వలే భయం తమం సమంగా కలిసినపుడు , ఊపిరి ఉల్లాసంగా పీల్చుదాం. అని దోపిడీ కొంతసేపు మరిచిపోదామని ఆహ్వానిస్తాయి. పాపపంకిలాల బిలాలు అరుస్తాయి. బేహారుల గొంతుకలు అనుచూ సూర్యుడు తన ఆత్మలో తలుచ వినిపించసాగేను వింతగొంతుకలు.

నలభై మూడవ పేజీ ఏకకంఠ ప్రసంగంలాగ దీర్ఘంగా సాగుతుంది. "ఇచ్చట ఆనందం కారుచవక రిపేరు చేయబడును. మీ విరిగిన జీవన నౌక! సినిమా రికార్డులా వేడి వేడి – సంగీతం మీ సొట్ట సరదాలు నడిచేందుకు ఊతం మనం కొద్దిగా తిమ్మిరెక్కితే చాలును మీ హృదయాలలో ఆనంద విహంగం వ్రాలును. ఈ సాయంత్రానికి వృద్ధాప్యం రానేరాదు. ఈ మత్తు చీకటి తొలగి ఇక తెల్లవారదు. ఇచ్చట క్రొత్తదులు సైతం పాలుకారు కన్యలు చూడండి. మసక మసక కన్నులతో ఈ వన్నెలు మతిపోయిన నాట్యాలను చేసే షోకిళ్ళాలకు, పట్టండి మీరు సత్తువలేని కాకి బంగారపు పల్లకీలు, ఆగడాలు, కాగడాలు వెలిగిస్తామిక్కడ. ఇది పాలిపోయిన, వాలిపోయిన అందాల అఖాడా (?) ఇది నిత్య మిథ్యా సంధ్య.


ఆరుద్ర

సూపర్ సానిక్ క్షుద్రోక్తి వంటి పాపాల వాణిజ్య ప్రకటన విన్న సూర్యుడు తనలోన క్షోభించి చెడ్డ చర్యలు కడు మంచి జనులు చేయంగా కారణమేమిటో కనుగొనదలచి, తారుణ్య హృదయాన తర్కించసాగె... "ఎంత పతనం, ఎంత పతనం సతమతమవుతున్నారు. సరదాల కొరకు హతమవుతున్నారు. ఆనందం కొరకు, మీసాల మీద తేనెలు తుచ్ఛ సుఖాలు, ఆనందో్బ్రహ్మమంటారు. తింటారు పాపాన్ని. ఈప్సితాలకి సంతృప్తి లేక, కామితాలకి మితిలేక, మనస్సుకి ప్రశాంతి లేక మాతృశ్రీలు కావలసినవారు. వీరపత్నులు, వీరమాతలుగా అవవలసినవారు, చదువుకొన్నవారు, చదివేస్తే ఉన్న మతిపోయినవారు భవిష్యత్తుని లాలించవలసినవారు, వర్తమానాన్ని పాలించవలసిన వారు, వెర్రితలలు వేస్తూ నాగరికత పేర పిచ్చిపోకడలు పోతూ ఎంత పతనం! యువకులు జాతి వెన్నెముకలు విరిగి ఎంత గూనిగా నడుస్తున్నారు. అరముగ్గిన ముసలివాళ్ళు విచ్చీ విచ్చని పిల్లవాళ్ళూ అందరూ క్షణికభోగం పరాయణులవుతున్నారు. ఏమిటి? దీనికి కారణం ఏమిటి? సంస్కరణకు సంస్కరణకు సాధనమా?

అప్పుడు సూర్యుని వద్ద అవతరించినది, అపురూపమైనట్టి అతిలోక రమణి సుశ్రావ్య మంజుల సూక్తిలు పలికి విశ్రాంతి ఇచ్చును. వేడి వేదనలకు ఆ విశ్రాంతి సమయంలో చెప్తాను జవాబు. దీనికి

అభిశప్తులు ఈ యుగంవారు! జీవితంలో సౌఖ్యం వాంఛనీయమైనా, సౌఖ్యమే జీవితం కాదు. బ్రతకడానికి తిండి తినాలి గాని, తినడానికే బ్రతుకుతారు వీళ్ళు. జీవన ఫలమందదు వీరికి. అందీ, అందని చో సమస్యలుండవెవరికీ!

"అక్కాంత సందేశమాశయసిద్ధి - దిక్కని మదిలోన తెలిసినవాడు అసదృశ్యరూపమ్ము నరసినవాడు - పసితనమ్మున జ్ఞానివలె పల్కినాడు!"

"ఎవరమ్మా నీవు? నిజాన్ని వంచి చావు. తల్చుకున్న రూపంలో పిల్చినట్లు వచ్చి నిల్చున్నావు? పోల్చుకున్నాను. పోల్చుకున్నాను. కల్చరు మూర్తీ భవించదానివి నీవు శాంతివి, అమందానంత కళామూర్తివి! నిర్మల శుభ సౌఖ్యనియతివి! నిశ్చల విజ్ఞాన నిరతివి! నీవు శాంతివి! ఎటుల పతితులనుద్ధరించుట, ఎటుల దేశాన్ని బాగు చేయుట! సెలవిమ్మా! అమ్మా నీవు శాంతివే కదా! ఈ అశాంతులకు అభాగ్యులకు నీ చల్లని దీవెనలిమ్మా" అంటూ దూరగతాల వలే కనిపించే స్వగతాలలో చెప్పుకుపోతుంది.

నా దీవెనలు సులభ సాధ్యమ్ము కావు. అయినా అవన్నీ సులభ సాధ్యాలే! జీవన ఫలాల్ని సాధించి దేశానికి కందిమ్ము అవి నాకు నైవేద్యము. కానిమ్ము అంటూ ఆవిడ అదృశ్యమైంది. అతని కన్నుల నిండా నీళ్ళు! అయినా అతడు ప్రార్థిస్తున్నాడు. శాంతిని వెళ్ళిపోవద్దని వేడుకుంటున్నాడు!




సమిష్టి జీవన సౌఖ్యం శ్రమైక జీవన సౌందర్యం అందరి కోసం ఒక్కడు, ఒక్కడి కోసం అందరూ నలుగురితో నారాయణ జీవితం. శాశ్వత మథనం. తుదిలేని కథనం తెద్దాం! అమృతాన్ని ఇద్దాం అందరికీ! రాను రాను జీవితం గంభీరమవుతుంది. మన్ను తాప హృదయం క్షేత్రాలన్ని జల్లుతా చేతనాలను విత్తనాలు, ఆశయాలను ఆవహింప చేసి సాధిస్తారు.

కన్నుల ముందు జరుగుతున్న మాయాజాలం చూసి, ఇతమిద్ధం పోల్చుకోలేక బెంబేలెత్తుతున్నాడు. మనిషి! ఇది మాయా ఇంద్రజాలమా? అయినా తేల్చుకుందుకు గొంతెత్తుతాడు. జీవితం అటు స్వర్గము కాదు. ఒక ద్వంద్వాతీత సన్నివేశం. సన్నివేశం అన్నంత మాత్రంలో సత్ నివాసం కాదు. ఆశల అడుగున నైరాశ్యం, నైరాశ్యాల తలపై మాయమూట.

ఇది సార్థక జీవనానికి సంకేతం. మానవత్వానికి సచేతన, కేతనం మంచితనానికి మెదడున్న నికేతనం!

ఆకస్మికంగా ఆ మాయ సూర్యుడే వైరాగ్యం, వేదాంతం బోధించనారంభించే అతను తన అభ్యంతరం చెబుతాడు. ఈ ప్రబోధాలన్ని దుర్భేద్య దుర్గాలని దాటించగలవా ఎందుకీ కితవ బోధనలు శాంతి దేవత దర్శనము చేసుకున్న సంతృప్తి నుండి భయంకర అసంతృప్తి! జరిగి ఆ అసంతృప్తి నుండి పరిత్యాగం దొరకగా గతాలనే వేడుకుంటూ నిష్క్రమించాడు. అతను వర్తమానం మోసగిస్తున్నప్పుడు ఆగామి అనర్థదాయకమైనప్పుడు ఏం చేయాలిరా దేవుడా? అని ప్రార్థన కాదు. డిమాండ్ అప్పుడే రెండవ ప్రకరణం ప్రారంభం అవుతుంది.

మూడు ముచ్చెలిక ఈ ఆధునిక ప్రబంధంలో - మూడవ అధ్యయనం అంతా అభివ్యక్తి చమత్కారాల వల్ల, ప్రత్యేక రంజు సాధించింది! ఆ బాల్యాదిగా ఆరుద్ర చమత్కార ప్రధాన కవి! కవిత్వంలో భావనా సాంద్రత కన్నా - చమత్కార వ్యగ్రత పరిపూర్ణంగా, అలవర్చు కున్నవాడు. చమత్కారం వల్ల పాఠకుడి హృదయం పూర్తిగా విప్పారిత మవుతుంది. తద్వారా ఒక పదానికి గల వ్యత్యాసం తరచి, పరిశీ లనార్థాలను తెలుస్తుంది. ఈ ఆశ్వాశంలో వయస్సు వస్తున్న కొడుకుతో తండ్రి జీవితంలో ప్రధాన ఘట్టాలైన వివాహాదుల గురించి ప్రసంగిస్తాడు. ఆ పాత్రలకు గల సహజ అమరికలు దూరం చేసి, వ్యంగ్య వైభవంతో సంపూర్ణత్వం సాధిస్తాడు! తద్వారా చమత్కారాభివ్యక్తికి అనన్య సామాన్యమైన ఆలోచన సాంద్రతను కలిగిస్తాడు. అంత మాత్రంలో తండ్రీ కొడుకుల పట్ల చులకన భావం కలిగించడు. చనువు తీసుకుంటూనే హద్దు మీరడు. నిజానికి ఈ ప్రబంధంలో ఈ ప్రకరణం మూడవదే! మొదటి భాగం కావ్యోపనిషత్తుగా శ్రీశ్రీతో ఆరుద్ర జరిపిన మీమాంశ చోటు చేసుకుంది. రెండవ ఆశ్వాశం నిర్వికారాదులకు వినియోగింపబడింది. అందులోనే బాలసారనాడు అనే కావ్యనామం గురించి చర్చ!

గ్రంథానికి రెండవభాగమైన తండ్రీ కొడుకుల వివాహ సంబంధమైన చర్చ సాగుతుంది. రెండవ క్రమం అధ్యయనం అతి దీర్ఘమై, వ్యక్తిగత మీ మాంసలకు అతీతంగా, పరిశీలన ప్రారంభం అవుతుంది. వివాహం, జీవితంలో దాని ప్రాముఖ్యత వంటివన్నీ కావ్యసంధికి దోహదం చేస్తాయి. కనుక ఈ కావ్య అంతర్గత నిర్మాణానికి అభ్యంతరం కావు!

బారసాల నాడు "ఆరుద్ర"! నీ ముద్ర ఔదలదాల్చి అంటూ ఈ కావ్యావతరణ గురించి, ముచ్చటలో కథనం చేశారు. మహనీయుల నోట అందుతాయి, అపభ్రంశాలు అవతరించవు గనుక సినీవాలి అనే మాట కూడా ఎలా సార్థకమైనదో వివరించాడు!

"కల నిజపరచడం కాదు. కవిత్వం నిజాన్ని కలగనడమే దాని తత్వం." అన్నాడు కనుక ఒక సత్యాన్ని కలలో చూపాడు. ఋషుల మాటల వెంట అర్థాలు నడుస్తాయన్నాడు. భవభూతి! నా మాట నిజం చేశాడు. ఆరుద్ర! నాకు మాట దక్కించి ఋషిత్వం కట్టబెట్టాడు! అంటూ వారు ముందుమాటలో వచన భాగంలో ముగించారు! స్వయంగా, ఆపుకోలేక, తదుపరి భావాలు వచన కవిత్వంలో రచించారు. దానివల్ల సంప్రదాయ బద్ధుడైన మహాకవిని వచనా కవితాపథంలో నిలపడమయ్యింది!!

కావ్యం సినీవాలి నవ్యాతి నవ్య సందేశం
నవ్యం అంటే సత్యం
భవ్యం నిది ధ్యాని తవ్వం. అందరి అందని తత్వం ఆచరితవ్యం.

విరిగిన ఎముకలగూళ్ళు, తరిగిన చర్మపు డోళ్ళూ! పాచిపట్టిన కాళ్ళూ, వ్రేళ్ళూ, గోళ్ళూ, ఈడ్చుకుపోయిన వరిముళ్ళు, నేటి బ్రతుకులు, వట్టి కూళ్ళు, గవుళ్ళు, చేతికందని భోగాల కోసం, మూతి మీసాలపై తేనెకోసం, వళ్ళుకాళ్ళలో బొల్లి గద్దల్లా కుళ్ళిన పశువులపై, ఈగల్లా కల్లబొల్లి నక్కల్లా, ముళ్ళకంపలపై కాకుల్లా తెల్లవారనివ్వను. ప్రొద్దుకుంకనివ్వరు. అల్లా, అల్లా వీళ్ళతో ఎల్లా కడుపునిండా తినలేదు. కమ్మగా బతకలేరు. వడిగిన జీవితపు నూలు

వడకలేరు. మూర తక్కువా కోరికలు ఎక్కువా – ఇదంతా ఆ కవికానిన జీవితపు నగ్నసత్యం. బారలు చాస్తారు. ఆశగా దూర, దూరాలకు దృష్టులు సారించి ఆశిస్తారు. పరుగులు తీస్తారు. ఎందుకో వ్యర్థ ప్రయత్నాలు చేస్తారు. ఇంతేనా ఈ బ్రతుకు, ఇంతేనా అంతా అమావాస్యేనా! కాదంటుంది. సినీవాలి – అదే కదా! సిలీ వాలి వ్యాఖ్య! గడచిన బ్రతుకు పథంలో చీకటి బ్రతుకులు మోసాను. చీకటి తనువులు మోసాము. "పాటుపోట్లు కరళ్ళ తుళ్ళింతలతో, రోదగా, గ్రచ్చపొదగా సినిమా పాటలా ముందు ఆర్కెస్ట్రా సొదగా, వట్టి దగాగా సాగే, ఉల్లోల కల్లోలంగా వూగే కడలి కడుపులో, అడుగున, ఈ హలాహలం అట్టడుగున దాగి, తరువాత అమృత భాండం లభిస్తుందని హామీని, అన్వేషణే పరమార్థం కానీ, కృతార్థం కాదని బ్రతుకు హెచ్చరిస్తుంది.

కదలే ఈ కాలకూటపు వేడి, వేడి చీకట్ల మధువులో మొదలే తొలి వెలుగు రేఖ "శీతా హార్యనుతా నీమంత సింధూరరేఖ! సినీవాలి" అదే మన మదిలో లభించే చివరి వరం!

శ్రీ కాటూరి వారు ఈ కావ్య రస పీయూషాన్ని అందుకుని విశదం చేసిన సారాంశం. ఈ కావ్యభర్త సినీవాలా బ్లాకొట్ల నుంచి రోజుకో సినీవాలి. ఇంకేమీ కావాలి? ఇదే కలకాలం నిలవాలి. దీన్ని కన్నయ్యకూ, కున్నయ్యాకూ కావ్యకర్త, భర్తలకు శుభాలు దక్కాలి. ఇంతకూ తనకు మాట దక్కింది. అంటూ తన పేరు చెప్పుకున్నాడు.

సవిషయసూచిక సాహిత్యోపనిషత్తు అనే శీర్షికతో ఆరుద్ర ఇలా ప్రశ్నిస్తాడు. ఏమయ్యా కవి నాదో మనవి! నువ్వెందుకు రాస్తున్నావో నూకలివ్వకపోయినా, భావాల మేకలెందుకు కాస్తున్నావో" చెప్పమంటాడు. చెప్పిందే చెప్పి. మళ్ళీ చెప్పడం, అప్పుడూ, ఇప్పుడూ కోరడం కష్టం, చెప్పనిది చెప్పి, మప్పితాలను చేస్తున్నాను. అదే నా రచన ప్రయత్నిస్తుంది. నా రచనలో ప్రయత్నం అదే అనుకుంటాను. కవిత్వం, అనుకరణం అనవసరం! అంతేకాదు అనర్థకం అందుకనే దేవుణ్ని సహా ఇమిటేషన్ చేయను అంటూ తన కవిత్వ సారాంశం విశదం చేశారు. పైగా తనలోని పెద్దపులికి ఆహారం. నా కవిత్వం, ఆ వ్యాఘ్రం, ఆకలి, ఆకారం! ఆ అభివ్యక్తికి మెచ్చుకున్న ఆరుద్ర అచ్చా స్వేచ్ఛా జీవి అనీ, వెనుక శ్రీశ్రీ అన్నమాటనే పునఃచెప్పి, మెచ్చుకుంటూ ఎవరూ చెప్పనిది, చెప్పి, మెచ్చుకోవడమే అన్నమాట కవిత్వం అని తన ఆమోదం తెలిపాడు! నచ్చుకుంటే మించిపోయావు! అంటూ మాట మార్చకపోతే ఆరుద్ర ఈ మాట గురజాడకు ఇమిటేషన్ కదా! అన్నాడు. ఇమిటేషన్ కాదు కొటేషన్, అని శ్రీశ్రీ వక్కాణించాడు. ఇదివరకు కవులను మింగెయ్యాలనే ఆకలి కాదది! నిన్నటి కవుల నుంచి, నేటి కవులు పుడతారు. కందం రాసిన వారు కవే కాని, అంతిమ కందపద్యం అల్లగలవాడల్లా ఎంత మాత్రం కవికాడు! అని నిశ్చయంగా చెబుతాడు! శ్రీశ్రీ, ఆరుద్ర ఒప్పుకుంటాడు!

"రుచి, ఔచిత్యం ఇవే ముఖ్యం." కవి కోరే మెప్పు కండ! సమాన ధర్ముల హృదయ స్పందనలు శిరః కంపనాలు! అదీ గీటురాయి. అసలైన కవిత్వానికి వానలాగ ప్రజల హృదయాలలో వర్షించాలి.

కవిత్వం మేలుకొల్పాలి గాని, జోకొట్టగూడదు అని ముగిస్తాడు శ్రీశ్రీ.

అప్పుడప్పుడది జోల ముప్పు ముంచుకొస్తే **కేక**... అప్పుడప్పుడు అవుతుంది జీవితం! దుఃఖభాజనం. అప్పుడు వెలుగు చూపించడం కవిత్వ ప్రయోజనం అప్పుడప్పుడు, జనం, కళ్ళకి కప్పుతాయి! ఏవో పొరలు. అప్పుడు కవిత్వం తొలగించాలి ఆయా తెరలు. అప్పుడప్పుడు అధికారులకిపోతుంది. కామన్‌సెన్సు! అలాంటి సందర్భంలో కవి తన ధనుస్సు ఎక్కడ పెట్టాలి అని, కవి ధర్మాన్ని, కర్తవ్యాన్ని వ్యాఖ్యానిస్తారు. శ్రీ.శ్రీ, ఆరుద్రలిద్దరూ కవిత్వ రససిద్ధులు కావడం వల్ల వాళ్ళ మూడు మాటలే కవిత్వం విషయంగా భాసించాయి. పైగా, ఆరుద్ర మరో తీర్మానం చేశాడు. కవిత్వానికి వర్తమానం పదునైన సానుకూల పరిస్థితులు రూపొందాయి. అప్పుడెప్పుడో, కంఠస్ఫూర్తి నుంచి మాని, పాదంతో శ్లోకంతో పుట్టిందట, కవిత్వం శాస్త్రాల సహస్ర క్లేశాలను అనుభవించి, స్వానుభవంగా పలుకగలిగేదే ఉత్తమ కవిత్వం! సమాజంలో ఎవరివల్ల ఎవడికైనా అక్రమం, అన్యాయం జరగకపోవడమే ఉత్తమ కవితా జనానికి ప్రాణం. కవి కావ్యంలో మంగళానుగుణమైన భరతవాక్యం అంతర్లీనంగా, ఉండాలి. అయితే కవిత్వ శాస్త్రధర్మాలు ఉపదేశించే సైన్సేకారాదు. అయితే కవిత్వం దానికదే గొప్ప భవిష్యత్తు! "కావాలి అది ఎడారిలో ఒంటె అనుభవాల తేట సరస్సు!"

అందరికీ ఉపయోగపడాల్సినదే కవిత్వం. కొందరికి ఊహే కలగకపోవచ్చు! అందులోని రహస్యం అప్పుడు సామాన్య మానవుడికి చేయూత ఇవ్వాలా సహృదయుడైన వ్యాఖ్యాత!" అని ఆరుద్ర కవిత్వ ధర్మాన్ని ప్రతిపాదించగా శ్రీ.శ్రీ అంటున్నాడు! "కవిత్వం మీద కవిత్వం కూడా కవిత్వమే! అది ఎప్పటికైనా తెలిసిపోయే రహస్యమే!" అర్థం కాని రహస్యం లేనట్టే అసలే బోధపడనిదంటూ ఏదీ ఉండదు.

బాహ్య భౌతిక విషయాలతో బిర్రబిగుసుకుపోయిన కొన్ని హృదయాలకు కొన్ని విషయాలు అర్థంకాకపోవచ్చు. అప్పుడే వ్యాఖ్యాత అవసరం వుంటుంది. మల్లినాథ సూరి వంటి జగమెరిగిన వ్యాఖ్యాతలు కూడా కొన్ని అందరాని విషయాలను విడిచిపెట్టారు. శ్రీశ్రీ అడిగాడు!

ఛందస్సుల నియమనిబంధనలలో లేదా ముప్పు చెప్పకుండానే ఏదో ఒక చందంలో చెవికింపుగా వినసొంపుగా కవి పలకడం ఖాయం. ఇంతకుమించిన ఛందో నియమం బంతి లేకుండా ఫుట్‌బాల్ ఆడ్డం లాంటిది అని ఆరుద్ర సమాధానమిచ్చాడు. దానిని అంగీకరిస్తూ శ్రీశ్రీ ఈ మాట అన్నాడు. అది నిజమే! మొదట లక్ష్యం తర్వాత లక్షణం.

**కవిత్వం, అనుకరణం అనవసరం! అంతేకాదు అనర్థకం అందుకనే దేవుణ్ని సహా ఇమిటేషన్ చేయను అంటూ తన కవిత్వ సారాంశం విశదం చేశారు. పైగా తనలోని పెద్దపులికి ఆహారం. నా కవిత్వం, ఆ వ్యాఘ్రం, ఆకలి, ఆకారం! ఆ అభివ్యక్తికి మెచ్చుకున్న ఆరుద్ర అచ్చా స్వేచ్ఛా జీవి అనీ, వెనుక శ్రీశ్రీ అన్నమాటనే పునఃచెప్పి, మెచ్చుకుంటూ ఎవరూ చెప్పనిది, చెప్పి, మెచ్చుకోవడమే అన్నమాట కవిత్వం అని తన ఆమోదం తెలిపాడు! నచ్చుకుంటే మించిపోయావు! అంటూ మాట మార్చకపోతే ఆరుద్ర ఈ మాట గురజాడకు ఇమిటేషన్ కదా! అన్నాడు. ఇమిటేషన్ కాదు కొటేషన్, అని శ్రీశ్రీ వక్కాణించాడు.**

# ఊసరవెల్లి

- డా॥ ఎం. హరికిషన్
సెల్ : 9441032212



ప్రపంచీకరణ కోసం
వీధి వీధినా అరచినవాడు
తెరవని తలుపులను
ఆంక్షల దౌర్జన్యంతో పగలగొట్టినవాడు
త్రిశంకు స్వర్గాన్ని ఆవిష్కరించి
భ్రమల్లో వూరించినవాడు
అబద్ధాన్ని ఆయుధ బలంతో
గ్లోబంతా నిజం చేసినవాడు
గ్రామాలను మాయం చేస్తూ
అక్టోపస్‌లా విస్తరించుకొని
ఇల్ల నిండా సరుకులు కుక్కి
ఆయుధాలు గుట్టల పక్కనే
ధనరాసుల కొండలు పెంచినవాడు
ఊరి చివరి జెండాలు
కోటలో రెపరెపలాడ్డం మొదలుపెట్టగానే
కొత్తరాగం అందుకొని
ఔట్‌సోర్సింగ్‌పై కత్తి దూస్తూ
కోట తలుపులు బిగించడానికి
స్పాన్సర్లు వెతుకుతున్నాడు

---

"న్యాయం గెలుస్తుందన్నమాట నిజమేగాని, గెలిచిందంతా న్యాయం కాదు" అని శ్రీశ్రీ నీ స్వేచ్ఛకు స్వస్తి పలికాడు. అయినా కవిత్వానికేముందిలే విలువ అది మోయలేని శిలువ. మాట్లాడ్డం ప్రారంభించినప్పుడే మనిషి కాట్లాడ్డం సాగించాడు కినిసి.

ఆరుద్ర జ్వాలలో ఒత్తి చుట్టూ ఉంటుంది నీలిమ. అది చీకటి అనుకుంటాం. కాదు సుమా! అయితే అజ్ఞాన లోకంలో చిరాయువుగా బ్రతకడమే గాక, తరానికి తరానికి సాంద్రంగా ఘనీభవిస్తుంది. ఆ చీకటిలోనే భయాలూ, అనుమానాలూ ప్రసరించింది. చీకటి ప్రపంచంలో జరిగే అనంతకోటి ఆశాభంగాలకు తన పాత్ర ఏమీ లేనట్లు నంగనాచిగా ముఖం వెళ్ళబెట్టింది. దానికి కారణం ఏమంటే ఆదిలో భగవంతుని వైపు ప్రయాణించాడు మనిషి. కాని, ఇప్పుడీ మానవుని వైపు తరుముకొస్తున్నాడు దానవుడు. మానవుని నీడుస్తున్నాడు. వెతుక్కుంటున్నాడు ఈశ్వరుడు." ఇది చిత్రమైన పరిస్థితే! ఇది వరకు సర్వాంశాలలోనూ, భగవంతుని సృష్టిలోనూ సర్వాంశాలను చూసి, కర్తవ్యకాళుడై చేతులు ముడుచుకున్న మానవుడు కాల ప్రభావము చేత తన పాత్ర విస్మరణీయం కాదని, చైతన్యవంతుడై గుర్తిస్తున్నాడు. కాని, సమస్త లోకాలలో ఇంకా దానవుని ప్రగల్భం వీగిపోలేదు. మారణాయుధాలు సిద్ధం చేస్తున్నాడు. పర్యవసానం భయపెట్టినపుడు సంసిద్ధమవుతున్నాడు. అగ్ని స్వాధీనం చేసుకున్న తొలినాళ్ళలో అగ్ని మీళే పురోహితం అని సంతృప్తిగా ఆనందించిన మానవుడు నేడు దుశ్శక్తులు ప్రగల్భానికి నివ్వెరపోతున్నాడు. గతంలో తాను అనలాన్ని ఎక్కడనుంచో దొంగిలించాడు. అనలాన్ని బానిసగా చేసుకున్నాడు. జంతుజాలాన్ని మచ్చిక చేసుకున్నాడు. కాలాన్ని గురించి ఈ రకాలుగా నిర్వచనం చేశాడు. "కాలోహ్యం నిరవధిః" – "విపులాచ పృథ్వీ" అని కూడా భావించాడు. తన వ్రేళ్ళే సహాయంగా కోటి లెక్కలు పెట్టాడు. అయినా అతని యోచన ఎప్పటికప్పుడు కొత్త దారులు వెదుకుతుంది. కనుకనే ఆధునిక నిర్వచనంగా నవ్యత్వం + మానవత్వం = కవిత్వం అని శ్రీశ్రీ నిర్వచించాడు. సందేహించడం వల్ల అడిగా అన్నాడు ఆరుద్ర. అడుగు అంటూనే శ్రీశ్రీ ఇంకా ఇలా చెప్పాడు. మానవజాతి ఇప్పటికే అనుభవిస్తున్న రోగం 50 సం॥ అనుశ్రుతం గానే వస్తుంది! వదల్లేదు. ఇంతట్లోకే ఎలా పోవడం! ఈ పాతకాలపు పైత్యానికి ఏది నైవేద్యం పెట్టడం! ఎద్దు పుండు కాకికి తెలుసు. ఇవాళ రమ్మంటే ఎలా వస్తుంది శుచి. గ్రద్దని సముద్రాలు, కొండలు కాపాడతాయి. గుడ్డును పక్షులు పోషించాయి. ఇక్కడే పారేసిన బిడ్డను. అవును మనం గొప్పవాళ్ళుగా మరణించిన ఒకనాటి మాట చెప్పుకుంటూ ఈనాడు ఊరేగడం అదే గొప్ప దోషం! నిజానిజాలను నిర్ధారించడం ఈనాటి కర్తవ్యం కనుక! ఈలోగా సాధించిన వేగాన్ని నినదించాలి! అన్నాడు. అప్పుడు ఆరుద్ర "జ్వాలలో ఒత్తి చుట్టూ నీలిమ ఉంటుంది. అదే చీకటి అని అనుకుంటాం. కాదు అంటూ ఆరుద్ర ఇలా వక్కాణించాడు. మానవుడు సహజంగా చాలా మంచివాడు. కాని, ఆటుపోటుల మధ్య పడ్డాడు. ఆదిలో అడ్వంచర్ వల్లే పొట్ట పోసుకున్నాడు. సాహసోపేతమైన జీవితం పొట్ట పోషించింది. ఆ అనుభవాన్నే సాటివాళ్ళ దగ్గర గానం చేశాడు. అందుకే గతంలో ఎవ్వరు చేసిన గొప్ప పనైనా అందరూ పొగడ్తలు పొందేవారు. వాడి చేష్టలు అందరికీ గొప్పగానే ఉండేవి. "ఆగామి కాపురంలో జాగ్రత్తను గురించి పాఠం చెప్పేది. తాను ఆదిమ సమాజాల కవితా ప్రయోజనాలు వీటి నుంచి మానవుడు వెలువరించాడు. బహు యోజనాలు తాతలు తాగిన నేతులు తలచుకుని కొందరు తేన్చి మేను వాల్చుతున్నాం. వర్తమాన కాలం గురించి కవిత్వం చెప్పాలంటే ప్రవర్తనలు మాత్రం అసంభవం అని తప్పదు. ఈ గతానికే ఇంకా గబ్బిలాలుగా వ్రేళ్ళాడుతున్నవాళ్ళున్నారు." వాళ్ళకి పురోగతి లేదు. సమకాలీన సమాజాన్ని, దాని ప్రవర్తనని, దానిని నడుపబడుతున్న శక్తులను చక్కగా విశ్లేషించనిదే ముందుకు అడుగుపడదు. స్థితికీ పురోగతి లేదు. గతి ఉన్నప్పుడే సమాజం ముందుకు నడుస్తుంది అంటూ ఆరుద్ర యధార్థం వివరించాడు. వెనుక చూపు వాళ్ళు వేయిమందిన్నూ, ముందుచూపు కవి ఒక్కడే చాలు. వాడు ఆవశ్యం కరిగిస్తాడు. మేలుకుంటాడు. రోగిష్టి మానవుడు కోలుకుంటాడు. పద్యాలే పచ్చితలవాడు. పాముపంటిదానికి విరుగుడు ఉంది. పాత తత్వానికి అని అడుగుతూ ఆరుద్ర మరో హెచ్చరిక చేస్తాడు. పండితుడు, పాత గోతిలో పడినప్పుడు, పామరులు ఊరుకోరు. తమకు కావలసిన పాటలు తామే పాడుకుంటారు.

వేయి సంవత్సరాల క్రితం ప్రారంభం అయిన తెలుగు కవిత్వంలో మధ్యలో గతాన్ని కీర్తిస్తూ ఆచారాల భారాన్ని మోస్తూ సగం వెనుక తిప్పి సాగుతున్నప్పుడు తమకు కావలసిన కవిత్వం తామే పాడుకుంటున్నారు అందరు కలిసి పాడిన గీతంలో అందాలు ఉండి తీరుతాయి అని యధార్థాన్ని వక్కాణిస్తాడు ఆరుద్ర. అంతట శ్రీశ్రీ చూశావా? ఆరుద్ర ఒక తమాషా సంప్రదాయం నిలిచే ఉంటుంది. హమేషా మూఢాచారాలు మారుతూ ఉంటాయి. కాని సంప్రదాయకులు తాత ముత్తాతల కాలం నాటి కథలే చెప్పుకొనడం జాతికి జీవన నాళిక! జనగీతిక!

# నిరీక్షణ

- మండవ సుబ్బారావు
సెల్ : 9493335150



ముసురు - ముసురు
ఊరు ఊరంతా ముసుగు దన్ని
ముడుసుకుంది
నువ్వు మాత్రం
నెత్తి మీద నుంచి జారుతున్న
ముసురు చినుకుల్ని చప్పరిస్తూ
ఇంటింటికీ వెళ్తావ్
ప్రపంచాన్ని పంచుతావ్
అంగాంగం కొంగరులు పోతున్నా
బొంగరంలా తిరుగుతూ
భూగోళం లోని కబుర్లు
ప్రాంగణంలో నిలుపుతావ్
క్షణ క్షణం తాజా వార్తల్ని
దూరదర్శిని చూపిస్తున్నా

నీవు అందించే కబుర్లలోని
కమ్మదనం కనిపించదెందుకనో?
ఇవ్వాళ నువ్వింకా రాలేదని
నా కళ్ళు గేటు వంకే చూస్తున్నాయ్
మనసు నిండా నీ ఊసే ముసురుకుంది

ఇళ్ళల్లో చైతన్యం పంచేసి
నువ్వు సూరీడ్ని నిదుర లేపి
కబకబా నాలుగు మెతుకులు కుక్కేసి
ముఖానికి చిరునవ్వు నలంకరించుకొని
హుషారుగా కాలేజీ కుర్రాడివై పోతావ్
భవిష్యత్తులో నువ్వు
“సర్ ఐజాక్ న్యూటనో, ఐనిస్టీనో” ఐతే
లోకమంతా కథలు కథలుగా చెప్పుకుంటుంది
నీ గతాన్ని

లేకపోతే ! లేకపోతే నువ్వు నీ బ్రతుకు
ఎవ్వడికి కావాలి?
ఇంతలో -
తొందర పడిన సుందర వదన
టీ కప్పు అందిస్తూ
“ఈ పూటకీ నిరీక్షణ చాలించండంది”

---

# గజల్

- బి. ఇందిర
సెల్ : 9849173560



సముద్రాన వానలుంటె ఏమి లాభము
ఎడారిలో ఓడలుంటె ఏమి లాభము

అంతెత్తున ఆకాశం ఎవరి కోసము
చిన్న గొడుగు పట్టకుంటె ఏమి లాభము

అగాధమౌ జలసంపద కడలి లోతుల
చుక్క దప్పి తీర్చకుంటె ఏమి లాభము

ఒక్క మెతుకు దక్కకుండా సొక్కినప్పుడు
అటు ధాన్యం ముక్కిపోతె ఏమి లాభము

వాడలలో మేడలలో సూర్యచంద్రులు
చదువులన్ని అందకుంటె ఏమి లాభము

తన స్వార్థమె చూసుకున్న ఏమి ఘనతలే
తడి చేరని కన్నులుంటె ఏమి లాభము

అనుభవాలు పాఠాలే ఓ ‘ఇందిరా’
విద్య దారి చూపకుంటె ఏమి లాభము

---

# హైకూలు

- మల్లారెడ్డి మురళీమోహన్
సెల్ : 9969346363



కంటిలో చెమ్మ
అమ్మ, ఎప్పటికీ
నాతోనే ఉంటుంది

రోడ్డుపై ట్రాఫిక్
నా మనసులో
ఆలోచనల్లా

సముద్రం ఘోషిస్తోంది
కెరటాలు
కవాతు చేస్తున్నట్టున్నాయి

కొవ్వొత్తి వెలుగుతోంది
కరుగుతున్నది -
మైనమా? చీకటా?

శీతాకాలం
అతిథై పోయె
సూరీడు

వాన
ఆడుకుంటోంది
పిల్లల్తో

పంచదార పోగు
చీమల వంతెన
విరిగిపోయింది

నేల వెలిబుచ్చిన
అభిప్రాయాలు-
రంగు రంగుల గడ్డిపూలు

సాలెగూడు
అంతస్తుల్లేని
అపార్ట్‌మెంట్

శిశిరం
చేసిన చేవ్రాలు
పండుటాకులు

నీటి బిందువులు
బోయీలై
తీగెను మోస్తున్నాయి

పక్షుల గుంపు
ఆకాశంలో
వల కదులుతోంది

అనువాద కథ

# పీనాసి (ప్రేమికుడు) ప్రేమ



**మూలం : ఫ్రెంచి కథ**

**అనువాదం : ఎ. అన్నపూర్ణ**

**దూరం నుంచి పోలీస్ వ్యాన్ ఆ ప్రాంతాలకు వస్తున్నట్టుగా హారన్ వినిపించగానే డేనియల్ ఉలిక్కి పడ్డాడు. గుండె ఆగినంత పనైంది. "నేనేం తప్పు చేశాను? పోలీసులు నన్ను పట్టుకు పోవడానికి వస్తున్నారు? నా భార్యను నేనెంతగానో ప్రేమించాను. తిండికీ, బట్టకీ ఏ లోటు చేయలేదు. నా కర్తవ్యాన్ని నేను నిర్వహించాను" అనుకున్నాడు.**

**పోలీస్ వ్యాన్ మరింత దగ్గరగా వీధి చివరన మలుపు తిరుగుతూ డేనియల్‌కి కనిపించింది. అంతే భయంతో అతడికి చెమటలు పట్టాయి. అక్కడే కూర్చుండిపోయాడు.**

జోసఫ్ కాఫీ హవుస్ ఉదయం వేళ సందడిగా వుంది వచ్చే పోయే జనాలతో. పని కుర్రాళ్ళు, జేమ్స్ డేనియల్ నాలుగు చేతులా వేగంగా సర్వ్ చేస్తున్నా పదార్థాలు సరిగా అందడం లేదు.

క్యాష్‌బాక్స్ దగ్గర కౌంటర్‌లో కూర్చున్న ఛెల్సియా శ్రద్ధగా, చురుకుగా పనిచేస్తూనే వచ్చిన వారిని మందహాసంతో పలకరిస్తోంది.

కాస్తంత తీరిక అయిన తర్వాత యజమాని ఇంటికెళ్ళిన సమయంలో ఛెల్సియాతో కబుర్లు చెప్పడానికి వచ్చాడు డేనియల్.

"వచ్చిన కస్టమర్లతో నవ్వుతూ కబుర్లు చెబుతావు. తీరికగా వున్నాం కదా. మనిద్దరం కలిసి భోజనం చేద్దాం రా!" అన్నాడు.

"నాకు పనుంది. నువ్వు తినెయ్. జేమ్స్ తోడున్నాడు కదా నీకు" అంది ఛెల్సియా. భోజనం చేసి వచ్చాక శ్రద్ధగా లెక్కలు రాసుకుంటున్న ఛెల్సియాతో కబుర్లు చెప్పాలని డేనియల్ ఆలోచన. అందుకే ఉబుసుపోక కబుర్లు మొదలుపెట్టాడు.

"ఎప్పుడూ పనే నీకు. కాసేపు నాతో మాట్లాడితే కొంపలేమీ మునిగిపోవు. కాస్త రిలాక్సవు ఛెల్సియా " అన్నాడు.

"ఖాళీగా వున్నప్పుడు చేయాల్సిన పనిని ముందే పూర్తి చేయడం నాకు అలవాటు. నువ్వు కూడా సాయంకాలం వచ్చే కస్టమర్స్‌కి వంటకాలు రెడీ చేసుకోరాదా. తీరా జనమంతా ఒకేసారి వచ్చేసరికి తలకిందులైపోతావు" అంది ఛెల్సియా చేస్తున్న పనిని ఆపకుండానే.

డేనియల్ చేసేది లేక ఛెల్సియా దగ్గిర ఆటలు సాగక వెళ్ళి జేమ్స్ దగ్గిర చేరాడు.

"ఈమెగారికి మన మీద పెత్తనం ఎక్కువైంది. జోసఫ్ అవిడగార్ని క్యాష్ బాక్స్ దగ్గర కూర్చోబెట్టి నెత్తికెక్కించుకున్నాడు. ఈవిడగారికి ఎక్కడా లేని గర్వం వచ్చేసింది" అన్నాడు.

"ఛెల్సీ చాలా మంచిది డేనీ. ఆమె తెలివీ, కస్టమర్స్‌ని స్నేహపూర్వకంగా పలకరిస్తూ ఆకట్టుకునే తీరూ, చాతుర్యం, ఓర్పు చూసిన జోసఫ్ ఛెల్సీని అక్కడ కూర్చోబెట్టాడు. అదే ఆమెకు తగిన చోటు. ఆమె అర్హతకు సరియైనదే. అంతేగాని ఆమెకు గర్వం లేదు" అన్నాడు జేమ్స్.

"నువ్వా! ఆమెకు సపోర్టేనా. ఇక నా పని ఖాళీయే...!" అని గొణుక్కున్నాడు డేనీ.

జేమ్స్ వయసులో డేనీ కంటే చిన్నవాడైనా నిజం గ్రహించాడు. ఛెల్సియా వల్లనే కాఫీ హవుస్ బాగా నడుస్తున్నదన్న మాట సరైనదే! అందుకనే జోసఫ్ ఆమె పట్ల తండ్రిలా వాత్సల్యంతో ఉంటాడు. ఆమెకు ప్రత్యేకించి ప్రతి సంవత్సరమూ వారం రోజులు శెలవు ఇస్తాడు. ఛెల్సియా తన ఫ్రెండ్స్‌తో కలసి సముద్ర తీర ప్రాంతాలకు విహారానికి వెడుతూంటుంది.

అప్పుడు డేనీకి అసూయ కలుగుతుంది.

'ఆమె స్నేహితుల్లో తప్పకుండా మగవాళ్ళు కూడా వుంటారు' అనుకుంటాడు.

ఆమె కనిపించక మతిపోయినట్టు వుంటాడు.

ఆమె తినిపించే చీవాట్లు తప్పిపోవడం లోటుగా అనిపిస్తుంది.

'వారం రోజులు శెలవు తీసుకుంటే సంపాదన వుండదు. మరింత కూడగట్టుకునే అవకాశాన్ని ఎందుకు వదులుకుంటుందో అర్థం కాదు.



మనీ సేవింగ్స్ పట్ల అస్సలు శ్రద్ధ లేదు.... అని గొణుగుతూ విసుక్కుంటాడు.

జేమ్స్‌కి ఒక విషయం తెలిసింది. 'డేనీకి ఛెల్సియా అంటే ప్రేమ!' అని.

ఒక రోజు స్పష్టంగా అన్నాడు కూడా.

"డేనీ నీకు ఛెల్సియా అంటే ఇష్టం. అందుకే ప్రతిరోజూ ఏదో ఒక విధంగా ఆమెను తల్చుకుంటావు" అన్నాడు కళ్ళెగరేస్తూ.

"ఏం కాదులే. కుర్రకుంకవి నా సంగతి నీకేం తెలుసని?

నిజానికి ఆమె అంటే కోపం. చాలా కోపం. జోసఫ్ అంటే కూడా కోపం. నన్ను చాలా చులకన చేస్తారు ఇద్దరూ. చూస్తుండు. ఏదో ఒకరోజు నేను కూడా కాఫీ షాప్ తెరుస్తాను. అందుకోసం మనీ కూడబెడుతున్నాను.

అప్పుడు యజమానిని నేనే. క్యాష్ కౌంటర్‌లో దర్జాగా కూర్చుని వుండగా చూస్తావుగా!" అన్నాడు.

"మంచిదే. అప్పుడు క్యాష్‌కౌంటర్‌లో నీ బదులు ఛెల్సియాను చూస్తానని నేను అనుకుంటాను. నువ్వెటూ కాఫీ షాప్ యజమానివే కదా! అన్నాడు హాస్యంగా.

శెలవులు ముగిసిన తర్వాత ఛెల్సియా తిరిగి వచ్చేసింది.

కస్టమర్స్‌తో ఎప్పటిలా కాఫీ హవుస్ కళకళలాడుతోంది.

ఆమె వారితో తన విహార ప్రదేశాల విశేషాలను హుషారుగా వారికి చెబుతోంది.

వారు వేసే జోకులకు విరగబడి నవ్వుతోంది.

డేనీకి ఒళ్ళు మండిపోతుంది. చిటపటలాడుతుంటాడు.

"ఓయ్ ఛెల్సీ... ఏంటి కథ? ఎవరైనా జతగాడు దొరికాడా ఏం? మహా మిడిసిపడుతున్నావ్..." అన్నాడు.

"ఆహా... బాగానే కనిపెట్టావే. నీతో మాట్లాడాలంటే ఏముంటుంది? పొదుపు గురించి పాఠాలు చెబుతావు. నా పద్ధతులు నీకు నచ్చవుగా."

ఏమంటావ్ జేమ్స్. నువ్వా నేనూ జట్టు కడదాం... డేనీ ఉడుక్కుంటాడు సరేనా?" అంది. మరింతగా డేనీని ఏడ్పించాలని.

ఆమె స్నేహితురాళ్ళు తరచుగా వస్తుంటారు. ఎడతెరపి లేకుండా పకపకలాడుకుంటూ ఒకటే కబుర్లు చెప్పుకుంటారు.

ఛెల్సియా వాళ్ళ దగ్గర మనీ తీసుకోదు సరికదా వాళ్ళ బిల్లును తన జీతం నుంచి కట్ చేసుకోమని యజమాని దగ్గర నిజాయితీ ఒలకబోస్తుంది.

"అమ్మో ఈమెగారిని కట్టుకుంటే పొదుపు మాట సరే దుబారా ఖాయం. ఇంత ఖర్చు మనిషిని నేనెక్కడ భరించగలను? అనుకున్నాడు భయంగా. ఒకరోజు ఛెల్సియా ప్రసన్నంగా వున్న టైములో తన మనసులోని మాటను వెల్లడించాడు.

"నువ్వు నాతో సహకరిస్తే స్వయంగా కాఫీ షాప్ ప్రారంభించవచ్చు. మనం పెళ్ళి చేసుకున్నామనుకో. ఇద్దరి జీతాలతో త్వరలో పెద్దగా మార్చుకోవచ్చు. ఏమంటావ్. ఈ ఉపాయం నీకు నచ్చితే మనం సుఖంగా వుంటాం! అన్నాడు.

డేనీ ఉడుకుమోతు బుద్ధి వెనుక తనమీద ఇష్టమూ ఉందని గ్రహించిన ఛెల్సియా బెట్టు చేస్తూనే అర్ధాంగీకారమూ తెలిపింది.

ఇద్దరూ కలిసి వారాంతంలో సాయంకాలం వేళ విహారాలు చేయడం.

ఛెల్సియా తన ఇంటికి టీకి పిలవడం చేయసాగింది.

"టీతో పాటు భోజనానికీ వుండి పొమ్మనొచ్చు కదా...!" అని డేనీ సరదాగా జోకులేసినట్టు తన పీనాసి బుద్ధిని బైటపెట్టుకునేవాడు.

ఛెల్సియా మదర్ రుసరుసలాడుతూ భోజనం వడ్డించేది. అయిష్టంగానే!

రెండు మూడు సార్లు ఇలా జరిగాక కూతురికి బాగా చివాట్లు పెట్టింది.

ఆవిడ డేనీ బుద్ధిని బాగా గ్రహించుకుంది.

"అతగాడు ఎప్పుడూ మనింటికి రావడమే గానీ మనల్ని ఏనాడూ రెస్టారెంట్‌కి పిలవనే లేదు. మహాలోభి... అంటూ సాధించేది.

ఛెల్సియాకి కూడా అతని ప్రవర్తన కష్టం కలిగిస్తూనే వుంది.

తల్లి నిజం చెప్పేసరికి మనసు చివుక్కుమంది.

'నిజమే... షాపింగ్‌కి తీసుకెళ్ళి మురిపెంగా చిన్న గిఫ్ట్ అయినా కొనడు.'

ముచ్చటపడి మూవీ చూద్దామంటే ఏదో వంక పెడతాడు.

'ఎటైనా వెడదాం కారు రెంట్‌కి తీసుకురా... అంటే నడక మంచిది. పోనీ బైక్ తెస్తాను. ఇద్దరమూ దగ్గరగా కూర్చుని షికారు పోవచ్చు' అంటూ తన బుద్ధిని బైటపెట్టుకుంటాడు! అని బాధ పడేది.

కానీ మనసులో ఏ మూలనో అతని పట్ల కలిగిన ప్రేమ ఆమెను అన్నీ సహించేలా చేసింది.

ఎన్నోసార్లు అడిగితే వాళ్ళ ఊరు తీసుకెళ్ళి తల్లిదండ్రులను పరిచయం చేశాడు. పెళ్ళి చేసుకోబోతున్నామని శుభవార్త చెప్పాడు.

పెళ్ళి ఏర్పాట్ల కోసం ఛెల్సీ చాలా ఉత్సాహపడింది.

ఒక ప్లాన్ ప్రకారం అరేంజ్‌మెంట్స్ కోసం లిస్ట్‌ను తయారు చేసి చూపిస్తూ.

"ఎంత పేదవాళ్ళమైనా వెడ్డింగ్ సూట్ నీకు, గౌను నాకూ. ఇద్దరికీ వెడ్డింగ్ రింగ్స్ గోల్డువి కావాలి. ఇవే పెద్ద ఖర్చులు. మన వాళ్ళందరికీ పార్టీ ఇవ్వాలి.

ఇదిగో... విందుకు ఆహ్వానించాల్సిన వారి పేర్లు... అంటూ చూపింది.



"నీకేమైనా మతి పోయిందా? ఈ లిస్ట్‌కి మన దగ్గర వున్న మనీ చాలదు సరికదా అప్పు చేయాల్సి వుంటుంది. ఆ అప్పు ఎలా తీర్చగలం? వెడ్డింగ్ గౌను, సూట్ రెంట్‌కి తెచ్చుకోవచ్చు. కాఫీ హవుస్‌లోనే పదిమందికి పార్టీ ఇవ్వాలి... డేనీ మాట పూర్తి చేయకుండానే ఛెల్సీ తన చేతిలో వున్న పేపరు గాలిలోకి విడిచిపెట్టింది.

ఇక హనీమూన్ భాగోతం అంతే! "మా ఊరు వెళ్ళి అమ్మా నాన్నల దగ్గర గడుపుదాం అన్నాడు. "స్విమ్మింగ్ డ్రస్ కొనుక్కుంటా ఇక్కడ లేక్స్‌లో స్విమ్మింగ్ చేయొచ్చు" అంటూ ముచ్చట పడిన ఛెల్సీని పట్టించుకోలేదు డేనీ.

అలా చాలా చాలా డబ్బు పొదుపు చేసి కొన్నాళ్ళకి స్వంతంగా కాఫీ షాపు తెరిచాడు. "ఇప్పుడు తాను ప్రయోజకుడయ్యాడు. ఒక కాఫీ షాపుకి యజమానిని, వ్యాపారిని..." అనుకున్నాడు గర్వంగా.

జోసెఫ్ వృద్ధాప్యం వలన ఇంటి దగ్గరే విశ్రాంతి తీసుకుంటున్నాడు. వ్యాపారం మానుకున్నాక ఛెల్సియాకి ప్రేమతో కొంత మనీని కానుకగా ఇచ్చాడు. దాన్ని ఆమె డేనీకి తెలియకుండా దాచిపెట్టుకుంది. ఈ పీనాసి మొగుడికి తెలిస్తే ఒక్క ఫ్రాంకు కూడా దక్కనీయడని తెలుసు కనుక.

రోజూ చేసే పనే మార్పులేని జీవితం. అంతకంతకూ పొదుపు అంటూ మరీ పీనాసిగా మారిపోయిన డేనీ. 'ఇప్పుడు డబ్బు జాగ్రత్త చేసుకోవాలి. నువ్వింకా వేరే చోట కూడా పనిచేస్తే ఇల్లు కట్టుకోవచ్చు...' అనసాగాడు.

కానీ ఛెల్సియాకి నిస్సారమైన ఈ జీవితంలో ఒక చిన్నారి తోడుగా వుంటే బాగుండుననే ఆశ కలిగిందని గ్రహించుకోలేని మూర్ఖుడు డేనీ. అయినా ఆశతో డాక్టరు దగ్గరకి వెళ్ళింది. ఈ మధ్య కాస్తంత ఆరోగ్యం సరిగా లేనందు వల్ల.

డాక్టరు ఆమెను శ్రద్ధగా పరీక్షలన్నీ చేసి డేనియల్‌ని పిల్చి చెప్పాడు.

"నీ భార్య సంతానవతి కావాలని కోరుకుంటోంది. అది ప్రతి స్త్రీకి సహజమైన కోరిక. నీవు కాస్త ఆమె గురించి కూడా ఆలోచించాలి. వ్యాపారం, సంపాదన ఇదే జీవితం కాదు. ఆమె కోసం కొంత కాలాన్ని కేటాయించు. భార్య కష్టసుఖాలు కూడా అవసరమే..." అంటూ చీవాట్లు వేశాడు.

"ఆమెకు మతిలేదు సరే! డాక్టర్ కెందుకు మా గొడవ? బిడ్డల పెంపకంతో ఛెల్సీ ఇంటిపట్టునే వుండిపోతే పనెవరు చేస్తారు? ఇల్లు ఎలా కట్టుకోవాలి? మహా చెప్ప వచ్చాడు పెద్దమనిషి..." అనుకున్నాడు నిర్లక్ష్యంగా.

"పోనీ బిడ్డలు వద్దు. ఓ కుక్కను పెంచుకుంటాను..." అంది ఛెల్సియా.

"దానికీ తిండి దండగే... అందామనుకున్నాడు. కానీ కాఫీ షాపుకి కాపలాగా పనికి వస్తుంది. వీధి కుక్కని తెస్తే సరిపోతుంది. మిగులూ, తగులూ ఎటూ వుంటాయి తిండికి... అనే ఆలోచనతో మౌనంగా వుండిపోయాడు.

ఛెల్సీ పరమానందంగా తన స్నేహితురాలి దగ్గరున్న కుక్క పిల్లనొకదాన్ని తెచ్చుకుని ముద్దుగా పెంచుకోసాగింది. అయితే దానికి తిండి సరిపోవడం లేదు. మాంసం పెట్టాలి ఎలా? డేనీ పిసరు కూడా మిగలనీయడు. ఒకరోజు బాగా నిలవ వుండి మిగిలిపోయిన మాంసాన్ని తెచ్చి రిఫ్రిజిరేటర్‌లో మూలగా దాచిపెట్టాడు తనెప్పుడో తినాలని. ఛెల్సీ దాన్ని చూసింది. 'వీడి పీనాసితనం మండిపోను. కుక్కకి వేయవచ్చును కదా! అని భర్త చూడకుండా తెచ్చి కుక్కకి పెట్టింది.

పాపం అది పరమానందంగా తింటూంటే సంతోషపడింది.

అంతలో ఎక్కణ్ణుంచి వచ్చాడో డేనీ వచ్చి చూడనే చూశాడు.

కుక్క దగ్గర ఆహారాన్ని లాక్కుని దాన్ని తరిమి తరిమి కొట్టాడు.

ఛెల్సీకి పట్టలేనంత అసహ్యం కలిగింది డేనీ మీద.

మనసుకి ఏ రకంగానూ సంతోషం లేదు. ప్రేమించానని పెళ్ళి చేసుకున్న డేనీకి సంపాదన కోసం తప్పితే తన ఆనందంతో పని లేదన్న నిరాశా, పనిలో అలసటా ఆమెను అనారోగ్యం పాల్జేశాయి.

దానికి తగ్గట్టు డేనీ కాఫీ షాపు ఎదురుగా ఒక హోటలు వెలిసింది.

జనమంతా అటు పోవడం మొదలుపెట్టారు.

చాలాకాలంగా ఛెల్సీ పరిచయం, ఆమె మంచితనం తెలిసిన రెగ్యులర్ కస్టమర్స్ మాత్రమే ఇక్కడికి వస్తారు.

ఛెల్సీ ఇదివరకులా చురుకుగా పనిచేయలేకపోతోంది.

మనిషి కూడా నీరసించిపోయింది.

ఆమెను చూసి అందరూ విచారంగా చెప్పుకోసాగారు.

"ఈ మధ్య ఛెల్సీ బాగా నీరసించిపోయింది. ఆరోగ్యం బాగున్నట్టు లేదు. మునుపటి ఉత్సాహమూ, చురుకుతనమూ లేవు."

ఈ మాటలు డేనీ వినకపోలేదు. సరికదా జరుగుతున్న నష్టం గురించీ, ఎదురుగా వచ్చిన హోటల్ గురించీ ఆలోచిస్తూ ఇదంతా ఛెల్సీ పని చేయనందువల్లనే అని నిర్ధారణకు వచ్చి సతమతమవుతున్నాడు. ఈ నష్టాన్ని పూడ్చుకోవాలంటే ఏం చేయాలనీ ఆలోచిస్తున్నాడు.

ఛెల్సియాను కలవాలని వచ్చిన స్నేహితురాలు ఆమె పరిస్థితి చూసి వెంటనే హాస్పిటల్‌కి తీసుకువెళ్ళింది. వైద్యం జరుగుతోంది. జోసఫ్, జేమ్స్ వంటి ఆప్తులు ఆమెను చూసి వెళ్ళారు. డేనీ చూడటానికి పోనేలేదని తెలిసి, వాళ్ళంతా చీవాట్లు వేస్తే రోడ్డు పక్కన పూచిన నాలుగు గడ్డిపూలతో పూల బొకే తయారు చేసి తప్పనిసరిగా హాస్పిటల్‌కి వెళ్ళాడు.

భర్త వచ్చినందుకు కోపం మరచి ఆనందపడింది ఛెల్సియా!

"ఎందుకు నువ్వు ఇలా ఆరోగ్యం పాడు చేసుకున్నావు? అసలే ఎదురుగా మనకి పోటీగా పెద్ద హోటలు వచ్చింది కదా. నేనా ఒంటరిగా పన్లు చూసుకోవాలి. నువ్విలా అయిపోయావు. ఎందుకు తిండి తినడం లేదు. మన షాపులో కావల్సినంత బ్రెడ్ వుంది. కోడిగుడ్డుతో చేసిన పదార్థాలున్నాయి తినవచ్చు" అని పరామర్శించి చేతిలో వున్న గడ్డిపూల బొకేని ఆమె చేతికిచ్చాడు.

ఆ మాత్రానికే మురిసిపోయింది ఛెల్సియా.

భర్త వైపు ఆరాధనతో చూసింది.

కళ్ళ వెంట ప్రేమతో ఆనందభాష్పాలు రాలాయి.

భర్త చేతిని తన చేతిలోకి తీసుకుని ముద్దు పెట్టుకుంది.

"ఏమిటే కన్నీళ్ళు పెట్టుకున్నావు? ఈ పూలుకొని నీ కోసం మనీ వేస్ట్ చేశానని అనుకుంటున్నావా? అదేం లేదులే. దారి పక్కన పూచిన పూలతో నేనే తయారు చేశాను. ఒక్క ఫ్రాంకు కూడా ఖర్చు కాలేదు. నువ్వు త్వరగా ఇంటికి వచ్చేస్తే మనం వ్యాపారం వృద్ధి చేసుకోవడానికి ఇంకా బాగా కష్టపడదాం. ఈ డాక్టర్లు వున్నవీ లేనివీ చెప్పి ఇలా హాస్పిటల్లోనే వుంచేస్తారు. మన వ్యాపారానికి ఎంత కష్టమో వీళ్ళకేం తెలుసు? అన్నాడు.

అంతే... అంతదాకా భర్త పట్ల కాస్త మెత్తబడిన మనసు కఠినంగా మారిపోయింది.

పట్టరాని కోపంతో చేతిలో పూలను రెండు చేతుల్తో నలిపి అతడి మొహానికేసి కొట్టింది.

అటువైపు తిరిగి వెక్కి వెక్కి ఏడ్చింది.

"నేనేం చేశాను? అంతలోనే ఇలా మారిపోయింది ఎందుకు? ఏమిటో... నీకు దెయ్యం పట్టినట్టుంది. నన్ను ఏనాటికీ తెలుసుకోవు.." అంటూ విసురుగా లేచి వెళ్ళిపోయాడు డేనీ.

అంతటితో ఆమె సహనం పూర్తిగా నశించిపోయింది.

సెల్ : 9490295170


## 'ప్రస్థానం'కు చందా కట్టండి!

## నెల నెలా మీ ఇంటికే ప్రస్థానం తెప్పించుకోండి!!




ప్రత్యేక తగ్గింపు!

అయిదేళ్లకు : రు. 500 /-
పదేళ్లకు : రు. 1000/-
సంవత్సర చందా (వ్యక్తులకు) : రు. 120/-
సంవత్సర చందా (సంస్థలకు) : రు. 150/-
విడి ప్రతి : రు. 10/-




ఒక మంచి పత్రికకు చందా కట్టండి! - తెలుగు సాహిత్య కృషిని ప్రోత్సహించండి!!

ప్రస్థానం

ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-20

వివరాలకు : 040-27660013, సెల్: 9490099059 ; ఇ.మెయిల్ : ssprasthanam_@gmail.com ; www. prasthanam.com

# పొట్టు పొయ్యి



- డా. కె. ఆశాజ్యోతి
సెల్ : 9449672394

పొట్టు పొయ్యి కూరడం
ఎంత అద్భుతమైన కళ!

పొట్టును పొయ్యిలోకి
పొందిగ్గా కూరడం
ఎంత నేర్పరితనం!

పొద్దు పొద్దున్నే పొట్టు కూరుతుంటే
పొట్టు వాసన వగరుగా తగిలి
నాసికను రసనాగ్రం చేసిందా
అనిపించేది!

అపుడే తెలిసింది నాలుకకే కాదు
నాసికకు కూడా రుచి తెలుసని!!

బాల్యంలో అమ్మ నాకే ఎందుకు
చెప్పేదో
తెలియదు కానీ
అడుగు ఎత్తున్న ఇనుప పొయ్యి తెచ్చి
రెండు అరిపాదాల మధ్య
ఇరికించి
రంపపు పొట్టు పోస్తూ చులాగ్గా
కూరడం
సామాన్యంగా కనిపించినా
అసామాన్యమని ఇపుడు తోస్తోంది

చుట్టూ కప్పబడి పైన తెరవబడి
పొట్టు కూరాక
కట్టెలు మలిగించడానికి
పొయ్యి ముందు భాగంలో
ఖాళీ జాగా ఉండేది!!

అది కాగితంతో కప్పెట్టి
పొయ్యి మధ్యలో
పొడవైన ఖాళీ పౌడరు డబ్బా పెట్టి
అది కదలకుండా పట్టి
పాదాలు కదపక
డబ్బా మెదపక
పొట్టు పోస్తూ కొయ్యతో కూరుతూ

గట్టి పడే కొద్దీ తిరిగి పొట్టు పోస్తూ...!
ఎంత సవ్యసాచిత్వం!!
అర్జునుడైనా
ఈ నేర్పు ముందు
బలాదూరే!!

పొట్టు కూరాక పౌడరు డబ్బా
అటూ ఇటూ తిప్పుతూ
మెల్లగా
పుట్టలోంచి పామును
తీస్తున్నట్టు ఒడుపుగా
తీయకపోతే
ఒక్కసారిగా కోట గోడ కూలినట్టు
పొట్టంతా కూలిపోతుంది!!

ఊడలా పాతుకుంటుందని
నమ్మి కూరాక కూలిపోతే
కలిగే దుఃఖం
చెప్పనలవి కాదు!!
ఎందుకంటే
వంట ఆలస్యమవుతుందని
అమ్మ రెండు తగిలిస్తుందనే
భయం వెన్నులో పామై
జర జరా పాకేది!!

అందుకే
దొమ్మరి పిల్ల తీగపై గుత్తంగా సాగినట్టు
పళ్ళ మధ్య నాలుక పంటి కింద బడక
తప్పించుకొన్నట్టు
నెమ్మదిగా ఒడుపుగా లాగాలి!
ఎట్టకేలకు కృషి
విజయవంతమైందనుకుంటే
సరికాదు!!

కట్టెలు పెట్టి మంట రాజేయడానికి
పొయ్యి ముందు భాగంలో
సైంధవుడిలా అడ్డుగా కాగితం!!

దాన్ని కుదురుగా తొలగించి
అక్కడ ఉన్న పొట్టును సుతారంగా సున్నితంగా
పిచ్చిక గూడును కదిలించినట్టు
గువ్వ రెక్క కింద పిల్లను కదిపినట్టు
మునివేళ్ళతో
పొట్టును రాల్చుతూ పోకపోతే
రాక్షసుడి ప్రాణం
ఏడు సముద్రాలకు అవతల
చిలుకలో ఉన్నట్టు
తెలుసుకుని మసలుకోకపోతే
పడిన శ్రమంతా వ్యర్థం
మళ్ళీ మొదటికి పయనం!!

ఎంత క్లిష్టమైనా ఆ పనిని లేత చేతులు
మెషిన్ గన్ను పేల్చినట్టు చక చకా చేసేవి!!

అలవోకగా చేసేసే నడుం మీద చేతులేసి
ఆరిందాలా గర్వంగా నేను గనుక చేశాను కదా
అన్నట్టు చూసేవి!!

పొయ్యి తీసుకెళ్ళి వంటింట్లో పెట్టి వెలిగిస్తే
మంటలు మిట్ట మధ్యాహ్నం వేసవిలో
ప్రచండ భానుడి చంద్ర నిప్పుల్లా
భగభగమంటూ అరుణ కాంతులను
వెలార్చుతుంటే
చూడముచ్చటగా ఉండేవి ఆ పసి మనసుకి!!

వంట ముగిశాక
కూలడానికి సిద్ధంగా ఉన్న బూడిద
నల్లగా, తెల్లగా బరక బరకగా
బలంగా నిలబడి ఉండేది!
వేలు తాకించగానే
పెళుసులుగా విరిగిపోయేది!!
మరో ప్రయత్నానికి సిద్ధమన్నట్టుగా!!

ఏనాటి పొట్టు పొయ్యి?
ప్రపంచీకరణ ప్రభావంలో
పిట్టలూ, పొలాలూ, పచ్చదనాలూ
మాయమైనట్టు
పొట్టు పొయ్యి అస్తిత్వం
అదృశ్యమైంది!
జ్ఞాపకంగా మిగిలిపోయింది!!

# చీకటి వెలుగుల ప్రతిబింబం

**- వీరప్రసాద్**




అర్థవంతంగానూ, పొందికగానూ కూర్చిన కవిత్వం పాఠకులను అలరిస్తుంది. చిక్కటి కవిత్వానికి విలక్షణమైన కవితా వస్తువు మరింత వన్నె తెస్తుంది. ఆకాశవాణి అనౌన్సర్, ఈవెంట్ ఆర్గనైజర్ వంటి బహుముఖ పాత్రలు పోషిస్తున్న కవయిత్రి అయినంపూడి శ్రీలక్ష్మి గతంలో 'అలల వాన' కవితా సంపుటి వెలువరించారు. తాజాగా విశేషరీతిలో 'లైఫ్ ఎట్ ఛార్మినార్' డాక్యూ పోయెమ్ అనే సుదీర్ఘ కవితతో పాఠకుల ముందుకు వచ్చారు.

హైదరాబాద్ అనగానే గుర్తుకు వచ్చే 'చార్మినార్' ఈ దీర్ఘ కవితా వస్తువు. చార్మినార్ విలక్షణత, విశిష్టత ఈ కవితలో చక్కగా ప్రతిబింబించింది. చారిత్రక కట్టడం ప్రాధాన్యత, మత సామరస్యం, అక్కడి ప్రజల జీవనోపాధి, మక్కామసీదు, పావురాలు వంటి వన్నీ ఈ దీర్ఘకవితా ప్రయాణంలో పాఠకుడిని విభిన్నంగా పలకరిస్తాయి. ఆశ్చర్యపడేలా చార్మినార్ పరిసరాలను కొత్త కోణాలలో ఆవిష్కరిస్తారు. అందమైన భావచిత్రాలు పాఠకుడికి గిలిగింతలు పెడతాయి. 'చార్మినార్-/ నాకు విచ్చుకున్న దోసిలిలా అనిపిస్తుంది/ దేవుణ్ణి-/ ఏ కోరిక కోసమో అర్థిస్తున్న భక్తునిలా అనిపిస్తుంది' శూన్యాకాశంలోకి నిట్టనిలువుగా పైకిలేచిన చార్మినార్ గోపురాలను చేతులుగా మలిచి కవిత్వ శిల్పం చేస్తారు. చార్మినార్ పక్కనే అనుకుని ఉండే మక్కామసీదులో వేలాది భక్తులు నిత్యం చేసే నమాజు దృశ్యాన్ని ఈ వాక్యాలు ఆవిష్కరిస్తాయి. నాలుగు శిఖరాల చార్మినార్ నాలుగు రోడ్లుగా విస్తరిస్తూ మనుషుల్లో మానవత్వం నింపుతుందని కవితాత్మకంగా చెబుతారు. "నాలుగు దిక్కులా రోడ్లు వేసుకున్న చార్మినార్/ మనుషుల రక్తాల్లో/ ఏ సమున్నత మానవతావాదాన్నో/ ప్రవహింపజేస్తున్నట్టుగా అనిపిస్తుంది' అనడంలో మనుషుల్లో మానవత్వం ఒక నిరంతర ప్రవాహంగా కొనసాగాలనే భావనను బలంగా వ్యక్తీకరించే ప్రయత్నం కనపడుతుంది. భావ వ్యక్తీకరణకు శక్తివంతమైన పదాలను ఉపకరణంగా చేసుకోవడంలో కవయిత్రి ప్రతిభ వెల్లడవుతుంది. ఎటువంటి భావాన్నైనా తన వస్తువు పరిధి దాటకుండా సమర్థవంతంగా కవిత్వీకరించగలిగారు. ప్రతీ వాక్యంలో ఆర్ద్రత, కరుణ, మానవీయత అంతర్లీనంగా ప్రతిఫలిస్తాయి.

'నగరమంతటా/తెల్ల మఖమల్‌లా పరుచుకున్న చలి పవనం/చార్మినార్‌కు /వందల మీటర్ల దూరంలోనే "గాయబ్" అవుతుంది/ 'షాదాబ్ బిర్యానీ సొగసైన పరిమళాలు/హైకోర్టు - గుల్జార్ హౌస్ వరకు/ గాలిలో తేలివస్తాయి' ఈ చరణాలు పాఠకుల మనసులను ఆహ్లాదపరుస్తాయి. చలిని తెల్లని మఖమల్ వస్త్రంతో పోల్చిన కవయిత్రి భావుకత అబ్బురపరుస్తుంది. బిర్యానీ పరిమళాలు మన నాసికను చేరుకుంటాయి.

ఈ పుస్తకంలో అనేక చోట్ల కవయిత్రి భావాలు పాఠకుడిని ఆకట్టుకుంటాయి "హరేక్ మాల్ బీస్' అరుపులు/'దేనేకీ బాత్ బోలో భాయ్' బుజ్జగింపులు అన్నీ కలసి/ఏ అజ్ఞాత సంగీతకారుడో కూర్చిన/ మనుష్య సంగీతాన్ని వినిపిస్తుంటాయి' అంటారు. మనుషుల నిత్యజీవన సమరాన్ని చక్కటి కవితా చరణాలుగా మలుస్తారు. మనుష్య సంగీతం అనేది ప్రతీ మానవ హృదయాన్ని స్పందింపచేసే భావన. మనుషులు మనుషుల కోసం మానవీయంగా స్పందించినప్పుడు ఒక మంచి సమాజానికి ఆస్కారం ఉంటుంది. ఒక సమిష్టి భావన మనిషికి బలాన్నిస్తుంది.

'జనం కళ్ళల్లోకి తొంగిచూస్తే చాలు.../ ఆకాశంలోని నక్షత్రాలన్నీ కూడబలుక్కొని/ చార్మినార్ పరిసరాల్లోకి/ ఏ ఫ్లైయింగ్ సాసర్ లేకుండానే/ దిగివచ్చినట్లనిపిస్తాయి' అంటూ మనుషుల కళ్ళను నక్షత్రాలతో పోల్చి మెప్పిస్తారు. ప్రతీకాత్మకంగా, భావనాశక్తి ద్వారా అభివ్యక్తీకరిస్తూ దీర్ఘకవితను హాయిగా చదివేలా నిర్మించారు. పదబంధాల నిండా సామాజిక స్పృహ పరుచుకుని ఉంటుంది. అక్షరాలన్నీ అంతర్లీనంగా సామాజిక సంగీతాన్ని వినిపిస్తుంటాయి.

చార్మినార్ చుట్టూ ఉండే నిరంతర జనసందోహం గురించి తెలిసిందే. ఆ జనం గురించి, వాహనాల రద్దీ గురించి - 'మనుషులు నడిచేందుకే దారిలేదు.../ అయితేనేం-/ బైక్‌లు - ఆటోలు కూడా / యథేచ్ఛగా పరుగెడుతూ ఉంటాయి/ ఆ వైశాల్యం రోడ్డుది కాదు.../ ప్రజల గుండెల్లోనిది...' అంటూ కవిత్వం చేయడమే కాదు. మనుషుల హృదయ విశాలత్వాన్ని మహోన్నతంగా పోలుస్తారు. రోడ్లు వైశాల్యంగా లేకపోతేనేం... ప్రజల హృదయ వైశాల్యాల ముందు ఏ ఇరుకురోడ్లూ నిలబడలేవు అనే భావాలు చదువుతున్న పాఠకుల మనస్సులను మరింత విస్తరింపజేస్తాయి. చార్మినార్‌ను సందర్శించే వారికి అక్కడ కొలువైన

# హైకూలు

ఇంగ్లీషు నుండి తెలుగు :

- సత్యరంజన్.కె



రెండు చెట్ల నడుమ
కొమ్మల పరికింత
ఏ కొమ్మ ఎక్కడం - **టైరోన్**

చెర్రీపూలు వికసిస్తే
'వసంతం' అంటారు జపాన్‌లో
కాని ఇక్కడ మాత్రం కాదు - **షెల్లీ**

పగోడా పక్కన
తెల్లబారి ఒరిగిపోతూ
నా పాత చెట్టు స్నేహితుడు - **షాన్**

ఆకాశంలో తెలి నీలపు మంచు
చెట్టు కొమ్మ కొసల కరుచుకు ఉన్న తెల్లదనం
సంప్రదాయ వస్త్రధారి మంచు - **గోపిక**

'బోన్సాయ్' అని అరిచాడు పిల్లాడు
నాకు కవిత్వం అంటే ఇచ్ఛగించదు
'హైకూ' దారే వేరు - **జోయి**

ఎంత పెద్ద పురాతన వృక్షమో
చుట్టుముట్టుతా చిన్న చెట్లు
తలపైకెత్తి దానికేసే చూస్తున్నాయి - **స్టేసీ**

చెట్టుకు కాగుతున్న
రెండు 'సీగల్' పక్షులు, ఒక ఎర్రపిట్ట
వసంతం కోసం ఎదురుచూపు - **జెన్నిఫర్**

రంగుచుక్కను ఊదాను
వృక్ష ఆకృతిలోకి
నాట్యగత్తెలా వుంది - **కిమ్**

కొలనులో శీతాకాలం
పెళుసు చెట్టున వేలాడుతున్న మంచు
కప్పలు ఎక్కడికి పోయాయ్? - **డీన్**

తోటలో 'పియర్' చెట్టు
కిటికీ మంచు తెరగుండా చూసా
గాలికి వొణుకుతుంది - **కాథలీన్**

---

ముత్యాల దుకాణాలు ఆకర్షించకుండా ఉండవు. ముత్యాలంత అందంగా వాటినీ అలవోకగా కవిత్వంలో అమర్చారు - 'రాళ్ళు... రంగుల రాళ్ళు - బీడ్స్ హారాలు/ చార్మినార్ చేరువలోని షాపుల చెట్లకు/ వ్రేలాడుతున్న ద్రాక్ష పళ్ళలా ఉంటాయి' అంటూ కవిత్వాన్ని పండిస్తారు.

'తోపుడు బళ్ళపై కప్పి ఉన్న / బ్లూ టార్పలిన్ పై నుంచి చార్మినార్/ సముద్రంలోంచి పొడుచుకొచ్చిన పర్వతంలా ఉంటుంది' అంటూ చార్మినార్‌ను విలక్షణంగా చూపించే ప్రయత్నం చేస్తారు కవయిత్రి. హైదరాబాద్‌లోని చార్మినార్ చుట్టూ సముద్రం ఉండే అవకాశం లేదు. చార్మినార్ చుట్టూ ఉండే పండ్ల బళ్ళ మీద కప్పే నీలం రంగు టార్పాలిన్‌ను చార్మినార్ పైనుండి చూసినప్పుడు కవయిత్రికి ఈ సముద్ర దృశ్యం కనపడింది.

ఈ సుదీర్ఘ కవితలోని బలమైన వాక్యాలు పాఠకుడి మనస్సు మీద ముద్రవేస్తాయి- 'నిత్య జీవితం కాస్తా/ వాహనాలు వాహనాలుగా రోడ్డెక్కుతుంది/ కాలినడక - సైకిల్ - స్కూటర్ - ఆటో.../ ఏదైనా / చలనమే జీవన సంగీతం/ కదలికే బ్రతుకు మాధుర్యం' నేటి వేగవంతమైన జీవితంలో కదలికకు ప్రాధాన్యం పెరిగింది. 'చలనమే జీవన సంగీతం' అనడంలో కవయిత్రి జీవిత స్పృహ స్ఫూర్తిని కలిగిస్తుంది. వేగంగా కదిలి బ్రతుకు మాధుర్యాన్ని అందుకోవడాన్ని సూచ్యంగా ఈ వాక్యాలు వ్యక్తీకరిస్తాయి.

మనిషి అనుభవ ప్రాధాన్యతను చమత్కారంగా చార్మినార్‌కు ఆపాదించి కవిత్వం చేస్తారు. మనిషి అనుభవంలోంచే నాగరికత, విజ్ఞానం వికసించి నేటి ఆధునిక సమాజం ఆవిష్కారమయ్యింది. అలాంటి అనుభవానికి విలువనిస్తూ - 'ఇప్పుడు చార్మినార్ - ఎన్నెన్నో అనుభవాలతో/ తలంతా నెరసిన పెద్దమనిషిలా ఉంది' అంటారు. ఈ వాక్యాల్లో చార్మినార్ పట్ల గౌరవంతో పాటు ఆపేక్ష వ్యక్తమవుతుంది. 'చరిత్ర మెట్లెక్కి/ శిధిల అనుభవాలు - చీకటి జ్ఞాపకాల గుండా/ వెలుగు జాడలవైపు/ మనిషి చేస్తున్న ప్రస్థానమే - చార్మినార్' అంటూ చార్మినార్‌కున్న చారిత్రక కోణాన్ని ఆవిష్కరిస్తారు. ఈ వ్యక్తీకరణ మనిషి భవిష్యత్ వికాసానికి కొనసాగే ప్రయాణాన్ని స్ఫురింపజేస్తుంది. ఒక ఆశావహ దృక్పథాన్ని చాటుతుంది.

ఈ దీర్ఘకవిత చివరి చరణాల్లో కవితా సారాంశం శక్తివంతంగా వ్యక్తమవుతుంది. - 'ఇప్పుడు చార్మినార్ అంటే -/ చిరిగిన బ్రతుకుల్లోని సెలబ్రేషన్/ మెరుపుల లైఫుల్లోని ఫ్రస్ట్రేషన్/ వేకువలోని చీకటి/ రాత్రిలోని వెలుతురు/ చరిత్రలోని ప్రస్తుతం/ వర్తమానంలోని గతం/ కన్నీటిలోని ఆనందం/ సంతోషంలోని దుఃఖం/ చార్మినార్ -/ నగరం చెక్కిలిపై ఘనీభవించిన కన్నీటి చారిక/ నగరం కన్నుల్లో విరిసిన కొత్త ఆశల గీతిక' అంటూ పాఠకుడికి తన కవితా ప్రయాణం నుండి సెలవిప్పిస్తారు.

సుదీర్ఘ వచన కవితను పాఠకుడు మెచ్చేలా, ఆస్వాదించేలా రాయడం కత్తిసామే. ఆయినంపూడి శ్రీలక్ష్మి ఆ విషయంలో విజయం సాధించారు. సుదీర్ఘ కవితా ప్రయాణంలో పాఠకుడు అలవోకగా, సెలయేరు పరవళ్ళను ఆస్వాదిస్తున్నట్లుగా కవితా ప్రయాణం చేస్తాడు. ఎత్తుపల్లాలు వచ్చినప్పుడు సెలయేటి గలగలలు, సయ్యాటలు ఉన్నట్లే కవితా పఠనంలో ఉద్విగ్నతలు, విస్మయాలూ పాఠకుడిని పలకరిస్తాయి. హృదయ స్పందనల మధ్య కవిత్వ ప్రయాణం పూర్తవుతుంది. ఒకప్రక్క చార్మినార్‌ను చారిత్రాత్మకంగా కీర్తిస్తూనే కాలం ఒడిలో నిట్టనిలువుగా నిలబడ్డ చార్మినార్ చుట్టూ అల్లుకున్న జీవితాల తడిగుండెలను పాఠకులకు తట్టి చూపుతుంది 'లైఫ్ ఎట్ చార్మినార్'

అక్షరం అక్షరంలో మానవతా స్పర్శ పాఠకుడి హృదయాన్ని తాకుతుంటుంది. ఓ పక్క చార్మినార్ అందాలనీ, అక్కడి ప్రజల జీవితాలలోని సంతోషాన్ని, మరోపక్క గూడుకట్టుకొన్న జీవిత విషాదాలను సమపాళ్ళలో వ్యక్తీకరిస్తుంది కవిత. చీకటీ వెలుగూ రెండూ మేళవించిన జీవితాలకు ప్రతీకగా చార్మినార్‌ను వ్యాఖ్యానిస్తారు కవయిత్రి. పదాలన్నీ భావుకతను నింపుకుని ప్రవహిస్తుంటాయి. ఈ సుదీర్ఘ కవితాధారలో చార్మినార్‌ను కట్టించిన నిర్మాతల, నేపథ్య గాథల ప్రస్తావన గానీ కనపడదు. అదేమీ లోటుగా కూడా అనిపించదు. అయినంపూడి శ్రీలక్ష్మి సారథ్యంలో కేవలం ఐదుగురు మహిళలు 24 గంటల పాటు చార్మినార్‌ను డాక్యుమెంటరీ కోసం చిత్రీకరించారు. అందుకు నాంది, స్ఫూర్తి ఈ సుదీర్ఘ కవితే కావడం విశేషం. చార్మినార్‌ను ఒక చారిత్రక కట్టడంగానే చూడకుండా అక్కడి ప్రజల జీవన సమరాన్ని కూడా కవిత్వం చేయడం అభినందనీయం. ■

# నానీలు

- బొమ్మరాత యల్లయ్య
సెల్ : 9494318616



నిన్నా మొన్న
ప్రసవ వేదనం
పచ్చగ నేడు
నవ్వింది విత్తనం

కరకు కత్తి
కన్నీరు పెట్టింది
అమాయకుడిని
అంతం చేసినందుకు

అధికారం లక్ష్యమైన
రాజకీయ వారకాంత
ఎవరికైన ఇస్తుంది
మారాడక కౌగిలింత

ఎన్నిసార్లొచ్చినా
పంచవర్ష ప్రణాళికలు
చిరు వర్షానికే పొంగును
మా వీధి కాల్వలు

తోడెవరు లేకున్నా
నీ నేస్తం పుస్తకం
అజ్ఞానం వదిలేసి
పదునెక్కును మస్తకం

పేగు బంధాన్ని సైతం
పెళ్ళున తెంపేసి
అల్లుకు పోతుంది
ఆర్థిక సంబంధం

కూటి కొరకు పల్లె ప్రజలు
పట్టారు పట్నం బాట
ఓటు కొరకు మన నేతలు
పట్టారు 'పల్లెబాట'

---



# కరువు ఆ తర్వాత

- తెలుగు : డా॥ జి.వి. రత్నాకర్
హిందీ మూలం : నాగార్జున్
సెల్ : 9849303175

చాలా రోజుల వరకు పొయ్యి ఏడుస్తూ వుంది
తిరగలి దుఃఖిస్తూ ఉంది
చాలా రోజుల వరకు ఆడకుక్క దాని పిల్లలు
పొయ్యి దగ్గరే పడుకున్నాయి
చాలా రోజుల వరకు బల్లులు భయంతో
పొయ్యికి కాపలా కాస్తూ వున్నాయి
చాలా రోజుల వరకు ఎలుకల పరిస్థితి
ఓటమిని అంగీకరించినట్లుంది
చాలా రోజుల తర్వాత ధాన్యం ఇంటికి వచ్చింది
చాలా రోజులకు ఇంటి ముంగిట్లోంచి పొగ పైకి లేచింది
చాలా రోజుల తర్వాత ఇంట్లో అందరి కళ్ళు
ఆనందంతో మెరిసాయి
చాలా రోజుల తర్వాత కాకులు రెక్కలు విదిలించి
కావు కావుమన్నాయి

---



అపరాజిత
వెల: రూ.100/- పేజీలు:198



కథల వాచకం
వెల: రూ.100/- పేజీలు:144



మనసులోని చలి
వెల: రూ.60/- పేజీలు:96



ప్రపంచ రచయిత్రుల కథలు
వెల: రూ.90/- పేజీలు:144



మరణోపనిషత్ మరో ఐదు కథలు
వెల: రూ.80/- పేజీలు:108

**ముక్తవరం పార్థసారథి పుస్తకాలు**

ప్రతులకు : ముక్తవరం పార్థసారథి
411, ప్రభాకర్ అపార్ట్‌మెంట్స్, విజయనగర్ కాలనీ,
హైదరాబాద్- 500 057
సెల్ : 91776 18708 : 23345091

మరియు

ప్రజాశక్తి, విశాలాంధ్ర, నవోదయ అన్ని బ్రాంచీలు



కథలు - కథకులు
వెల: రూ.80/- పేజీలు:136



కించిద్విషాదం
వెల: రూ.60/- పేజీలు:100



మీరే డిటెక్టివ్
వెల: రూ.80/- పేజీలు:121

# కొత్త పుస్తకాలు




## రాత్రి పగలు... ఒక మెలుకువ

(కథలు)

- బి.వి.ఎన్. స్వామి

వెల : రూ. 85/- పేజీలు : 104

**ప్రతులకు : 9866252260**

స్వామి తాను రాసిన కథలలోని జీవితానికి సన్నిహిత పరిశీలకుడు. దానిచుట్టు తిరుగుతూ దానిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించే పరిశోధకుడు. జీవితం ఉన్నతంగా, ఉత్తమంగా ఉండాలని తపించే చింతనాపరుడు. అందుకు అవరోధంగా ఉన్న శక్తులపై యుద్ధం అతని కార్యక్రమం. ఆ క్రమంల రూపొందినవే ఈ కథలు.

**- కాత్యాయనీ విద్మహే**




## అస్మదీయులు తస్మదీయులు

(కథలు)

- అంపశయ్య నవీన్

వెల : రూ.120/- పేజీలు : 136

**ప్రతులకు : 9989291299**

ఈ సంపుటిలో ప్రతి కథ పాఠకుణ్ణి తనలోకి తాను చూసుకునేలా చేస్తుంది. మనస్తత్వ విశ్లేషణాత్మక కథల్ని రచించడంలో నిష్ణాతుడైన అంపశయ్య నవీన్ రచించిన ఈ 12 కథలు మన సామాజిక జీవితంలోని 12 కోణాల్ని ఆవిష్కరిస్తాయి.

**- ప్రచురణకర్త**




## సాహు జీవితం రచనలు పరిశీలన

- వి.ఆర్. శర్మ

వెల : రూ.90/- పేజీలు : 134

**ప్రతులకు : 09391036987**

సామాజిక జీవితంలో రచన కూడా ఒక సామాజిక విప్లవాచరణగా సాహు కొనసాగించిన క్రమం యొక్క ప్రాధాన్యతను నొక్కి చెప్పిన తీరు ఎందరికో ఆదర్శం. సామాజిక ప్రతిఫలనంగా సాహు జీవితం, సామాజిక ఉద్యమాలు, సాహు సాహిత్యం ముప్పేటగా పెనవేసుకొని ఎలా కొనసాగుతూ వచ్చాయో సంశ్లేషించిన తీరు అపూర్వం. ఇందుకు అనేక ఇతర రచనలు ఎంతగానో ఉపయోగించుకున్న తీరు పరిశోధకులకు మార్గదర్శనం చేస్తాయి.

**- బి.ఎస్. రాములు**




## రేపటి వర్తమానం

- అదిగోపుల వెంకటరత్నమ్

వెల : రూ.60/- పేజీలు : 112

**ప్రతులకు : 9848252946**

ఏ వస్తువు చేపట్టినా దాన్ని 'కవిత్వం' చేయగలిగిన కవితా తత్వవేత్త. ఆయన రచించిన కవితా సంపుటాలు - నిజానికి ఆయన జీవితాంతం రాసే ఒకే ఒక 'మహాకావ్యం'లోని వైరుధ్యం లేని వైవిధ్యభరితమైన సత్యదర్శన అధ్యాయాలే. ఆయన సాహిత్యశక్తి 'సూర్యోదయం' నుంచి 'రేపటి వర్తమానం' వరకు రాశిపోసిన అమూల్య కావ్య రత్నాలు. ఈ సంపుటాలు ఆధునిక సమాజాన్ని నవచైతన్య దీపికలై అలరిస్తున్నవి.

**- జె. బాపురెడ్డి**




## రైతు నానీలు

- మేరెడ్డి యాదగిరిరెడ్డి

వెల : రూ. 40/- పేజీలు : 46

**ప్రతులకు : 9949415796**

నల్లగొండ జిల్లా పల్లెలోని ఫ్లోరిన్ నీళ్ళు, ఎండిపోయిన బోరు బావులు, కరెంట్ కష్టాలు, దళారుల దోపిడి, అప్పులు ఇలా ఎన్నో ఈ సంపుటిలో వున్నాయి. నా సొంత జిల్లా నల్లగొండ నుండి ఇప్పటికే డా॥ బండారు సుజాత శేఖర్, పున్న అంజయ్య తదితరులు పదునైన నానీలు రాశారు. ఈ ప్రాంత ప్రత్యేకతనూ, కడగండ్లను లోతుగా చిత్రించారు.

**- డా॥ ఎన్. గోపి**




## మంటి దివ్వ (కవిత్వం)

- సిరికి స్వామినాయుడు

వెల : రూ.80/- పేజీలు : 106

**ప్రతులకు : 9494010330**

లోతుల్లోకి వెళ్లి కవిత్వాన్ని, మానవ సంబంధాల్ని సమాజమూ, వ్యక్తులు, వాటి మధ్య ఉండే బహు సున్నితమైన అంశాల్ని పట్టుకొనే లోచూపు అలవర్చుకోవాలి. దానికి తన స్పందనా గుణాన్ని మరింత పదును చేసుకోవాలి. కవిత్వం, దాని వ్యక్తీకరణ ద్వారా వచ్చే విముక్తి, ఆనందం, దాని వెంట వచ్చే కీర్తి రుచి చశాడు. ఇక వదలడనుకుంటా. ఒక సిద్ధాంతం, ఒకతత్వం, కవిత్వం ఎలా రిలీజ్ చేయబడుతుంది. ఎలా కళాఖండం అవుతుందనేది నీ సాధన మీద, నువ్వు పోగుచేసుకున్న కవిత్వ సామాగ్రి మీద ఆధారపడి ఉంటుంది.

**- కె. శివారెడ్డి**




## వ్యవసాయం - ప్రపంచీకరణ

- కె.ఆర్. చౌదరి

వెల : రూ.100/- పేజీలు : 224

**ప్రతులకు : 040-66843495**

జనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ అండ్ టారిఫ్స్ (గాట్) చర్చల సరళి ఎలా సాగిందో, దంకెల్ డ్రాఫ్ట్ పేరిట పేద, వ్యవసాయ దేశాల మెడలకు ఉరితాడు ఎలా బిగించబడిందో, ప్రపంచ వాణిజ్య సంస్థ ఏర్పాటు వెనుక కుట్రలేమిటో, ఈ సామ్రాజ్యవాద నిర్దేశిత వ్యవసాయ విధానాల కింద మన రైతాంగం, వల్లె సీమలు ఎలా విధ్వంసమయ్యాయో, వ్యవసాయ రంగాన్ని పునరుద్ధరించడానికి ప్రజా ఉద్యమాలు, సమాజం ఏమి చేయవలసి ఉందో దిశా నిర్దేశం చేసిన వ్యాసాలివి.

- ప్రచురణకర్త




## పద పరిమళం (రెక్కలు)

- రంగనాథ్

వెల : రూ.50/- పేజీలు : 72

**ప్రతులకు : 98494 56799**

జీవన సత్యాల్ని, తాత్వికతని సూటిగానో, చిన్న మెలికతోనో చెప్పే రెక్కలు ఈ సంపుటంలో చాలా ఉన్నై. అయితే, పరోక్ష రచనలో ఉత్తమ స్థాయి ఉంటుంది. అటువంటివి కూడా ఈ సంపుటిలో బహుళంగా కనిపిస్తై. ఇది పదశక్తి వల్ల స్ఫురించేది కాదు. మొత్తం భావం మరికొన్ని ఆలోచనలకు తావివ్వడం ఇలాటి రెక్కల్లో చూస్తాం.

- అద్దేపల్లి రామమోహనరావు




## వేమన్న వెలుగులు (నాటికలు)

- డా॥ ఎన్. గోపి

వెల : రూ.250/- పేజీలు : 500

**ప్రతులకు : 040-27037585**

ఈ గ్రంథంలో 428 పద్యాలకు వ్యాఖ్యానం రాశాను. ఇవి జాగ్రత్తగా ఎంపిక చేసిన పద్యాలు. వేమన్న మూడువేల పద్యాలలోని ముఖ్యమైన భావాలన్నింటికీ ప్రాతినిధ్యం వహించే పద్యాలు వీటిలో ఉన్నాయి. ఆ రకంగా వేమన్న భావజాల సమగ్రతను దృష్టిలో పెట్టుకున్న సంకలనమిది.

- డా॥ ఎన్. గోపి




## లోలోన.. (కవిత్వం)

- సంగివేని రవీంద్ర

వెల : రూ.60/- పేజీలు : 98

**ప్రతులకు : 099871 45310**

ఆధునికతని ధిక్కరించడం అనివార్యమైన సన్నివేశంలో వున్నాం మనం. ఆధునికత తెచ్చిపెట్టిన అనేక దురవస్థల్ని నిరసించక తప్పని సందర్భంలో వున్నాం. అభివృద్ధి పేరిట బతుకును ఆడించే సాంకేతిక కుట్రల్ని ప్రతిఘటించడం తప్పనిసరి. ఈ గుర్తింపు, స్పృహ కవులలో మరింత ఎక్కువ. నగరాల్లో నివసించే కవికి ఈ ఎరుక మరింత ఉపయుక్తం. తమ సృజనాత్మక వ్యాసంగంలో భాగంగా ఆధునికతని ప్రతిఫలించే వస్తువుల్ని, భావనల్ని, సంకేతాల్ని వ్యతిరేకించడం కవుల కార్యాచరణలో కీలకమైంది. ఈ కోవలో ఎన్నదగిన కవి సంగివేని రవీంద్ర.

- గుడిపాటి




## సున్నితమైన కవి సుమనశ్రీ

- సౌభాగ్య

వెల : రూ.90/- పేజీలు : 104

**ప్రతులకు : 040-23811623**

ఈ పుస్తకంలో సౌభాగ్య వివరించిందంతా యథార్థానికి సుమనశ్రీ ఒక వ్యక్తిగా సాగిన ప్రయాణమే. ఇది ఒకడు నడిచిన దారి. నిజమే గాని, తన అంతస్సత్వాన్ని నిలబెట్టు కోవాలనుకున్న ప్రతి ఒక్కడూ నడవక తప్పని దారి కూడా. అందుకనే ఈ పుస్తకం చదువుతున్నంత సేపూ ఈ ప్రయాణం నాది కూడా అనిపించింది.

- వాడ్రేవు చినవీరభద్రుడు




## నేను.. నాయకురాలు నాగమ్మని మాట్లాడుతున్నా...! (ఆత్మ కవిత)

- కె.వి. నరేందర్, సంగివేని రవీంద్ర

వెల : రూ.50/- పేజీలు : 39

**ప్రతులకు : 09987145310**

బోరు కొట్టే చరిత్ర లోతుల్లోకి వెళ్ళకుండా, సూక్ష్మంలో మోక్షంగా, నాగమ్మకు జరిగిన అన్యాయాన్ని, ఆమె భావోద్వేగాన్ని కవితాత్మకంగా చెప్పేందుకు ప్రయత్నించాం. అరవెల్లికి చెందిన వీరనారిక కోణంలోనే దీన్ని ప్రస్తుతించాం. ఈ కవితలో నాగమ్మకున్న తెలంగాణా నేపథ్యాన్ని ఎత్తి చూపడం పై మేం ఎక్కువ ఆసక్తి చూపించాం.

- కె.వి. నరేందర్, సంగివేని రవీంద్ర

# 'సాహిత్యరంగం తీరుతెన్నులపై మీరేమంటారు' ?

'సాహిత్యరంగం తీరుతెన్నులపై మీరేమంటారు' అంటూ మీరిచ్చిన ప్రశ్నావళికి సమాధానాలు వరుసగా...

- కాలుతున్న పూలతోట, చివరకు మిగిలింది (అనువాదం : గాన్ విత్ ద విండ్), డేగ రెక్కల చప్పుడు, ఓల్గా నుండి గంగ దాకా... వంటి చాలా నవలలు చదివాను.
  కథలు ఎక్కువగానే చదివాను. అందులో 'హంసల రెక్కలు', 'లైఫ్ అండ్ టైమ్స్ ఆఫ్ ప్రకాశం' వంటివి డా॥ వి. చంద్రశేఖరరావు రాసిన కథలు నచ్చాయి. ఎందుకంటే వర్గ నేపథ్యంలో, ఉద్యమ నేపథ్యంలో తయారైన కథలవి. వాటిలో వచ్చే మార్పుల్ని చర్చిస్తూ రాసిన కథలవి.
  పెద్దింటి అశోక్‌కుమార్ కథలు, పాలపిట్ట ప్రత్యేక కథలు, ఇంకా చాలా సంపుటాలు, సంకలనాలు చదివాను. బి. అజయ్‌ప్రసాద్, మధురాంతకం నరేంద్ర, రామాచంద్రమౌళి ఇంకా ఎంతోమందివి కథలు చదివాను.
- యాకూబ్ 'సరిహద్దు రేఖ' చదివాను. చాలా బావుంది. జనకవనంలో పాల్గొని వేర్వేరు ప్రాంతాల నుండి వచ్చిన కవుల్ని కలుసు కున్నాను. అందులో చదివిన కవితల్లో 70% ప్రపంచీకరణ, విద్యామార్పుల్లో సమస్యలు వంటి వాటిపైన ఉన్నాయి.
- 2011లో విమర్శలు గమనించలేదు. కాని 'కథా శిల్పం' అనే గ్రంథం చదివాను.
- సాహిత్య పేజీల్లో సాక్షి జనరంజకంగా రాసే రచయితల ప్రస్తావన తీసుకొస్తుంది. వార్త, ప్రభలలో కవితా వాతావరణం ఎక్కువ కనబడుతోంది. ప్రజాశక్తిలో కవితలు ప్లస్ చర్చలు బాగున్నాయి. సాహిత్య పత్రికల్లో 'పాలపిట్ట', ప్రస్థానం' బావున్నాయి.
  ఆదివారం అనుబంధాల్లో అన్నీ బాగానే ఉన్నట్లనిపించినా, సీరియస్ కథలు ఆదివారం ఆంధ్రజ్యోతిలో చోటు చేసుకుంటున్నాయి. ప్రజాశక్తిలో అలనాటి మేటి కథలు ఆకట్టుకున్నాయి.,
- బాగా పెరిగింది.
- వారికి టి.వి.పైనే దృష్టి అంతా.
- ఇన్‌స్టంట్ లైఫ్‌లో ఇన్‌స్టంట్ కథల్ని బాగా ఇష్టపడుతున్నారు. తెల్సిన రచయితలవైతే తప్పనిసరిగా చదువుతున్నారు.
- సిడ్నీ షెల్డన్‌వే చదువుతున్నాను.
- తొలి కథ 'ఆలంబన', 'ప్రస్థానం' సెప్టెంబర్ 2011లో ప్రచురితమైంది. దీనికి జనార్ధన మహర్షి పురస్కారం కూడా దక్కింది.
- తత్వశాస్త్రం మీద వ్యాసాలు, 'రాబందుల రెక్కల చప్పుడు' పేరుతో వచ్చిన వ్యాసాలు చదివాను.
- పెద్దవారి ఆసక్తి హెచ్చుస్థాయిలో, సమకాలికుల ఆసక్తి మధ్యస్తంగానూ ఉంది. చిన్నవాళ్ళకు సినిమా, టి.వి. మీదనూ ఉంది.
- వందల్లో కొన్నాను. 90% వరకూ సాహిత్య గ్రంథాలే.
- 'ఆర్ట్ ఆఫ్ రైటింగ్' మీద (ఉదా॥ కథలెలా రాస్తారు. శార్వరి సంకలనం, శాంతి కృష్ణమూర్తి) రచనలు దొరకలేదు.
- ధనిక - బీద తారతమ్యాలు తగ్గినా మనసుల మధ్య లేస్తున్న అడ్డుగోడల మీద, తగ్గిపోతున్న ప్రేమ విలువల మీద రాయాలని ఉంది.
- 'ఆలంబన' కథకు మంచి రెస్పాన్స్ వచ్చింది. ఆ ప్రోత్సాహంతో చేయాల్సిన రచనలు చేయలేకపోయాను. ఎందుకంటే వృత్తిరీత్యా బిజీ.
- అభిప్రాయాలు చెప్పేంత అనుభవమూ, వయసూ నాకు లేవు.
- ఇంటరెస్టింగ్ ప్రోత్సాహం 100%.
- సాహిత్య అకాడమీ వారి అనువాద గ్రంథాలు విరివిగా వస్తున్నాయి. మరి మన తెలుగు అనువాదాలు వేరే రాష్ట్రాల్లో ఎలా ఉన్నాయనోనని తెల్సుకోవాలని ఉంది.
- ఆర్గనైజర్స్ ఏ లోటూ లేకుండా విజయవంతంగానే నిర్వహిస్తున్నారు (నేను వెళ్ళిన కథ-2010 ఆవిష్కరణ సభ, జనకవనం ఉదాహరణలు).
- నాకు తెలియదు.
- ప్రతిబింబించడంలో ముందున్నవనే అనుకుంటున్నాను.
- స్వాతి, నవ్య, ప్రస్థానం, పాలపిట్ట, చినుకు, మిసిమి, నది మొదలైనవి. ప్రస్థానం కథలు, వ్యాసాలు, నవ్య నీరాజనం, స్వాతి కథలు, పాలపిట్ట వ్యాసాలు...etc.. వంటివి ఆకట్టుకుంటున్నాయి.
- సంవత్సరంన్నర నుండీ బాగుంది. కానీ అందరికీ చేరితే ఇంకా బాగుంటుంది. నా వంతు కృషిగా చెప్తున్నాను. చదివిస్తున్నాను.
- కాల మార్పుల్నీ, సామాజిక మార్పుల్ని సూచిస్తూ రాసిన నవలల్ని సీరియల్‌గా ప్రవేశపెడ్తే బాగుంటుంది. ఉదా॥ ఓల్గాసే గంగ (ఓల్గా నుంచి గంగ దాకా - రాహుల్ సాంకృత్యాయన్), మధ్యలో 2 సంచికలు చదవకపోయినా మరలా కంటిన్యూ అవ్వొచ్చు.
- మంచి సాహిత్యం అందించేందుకు కృషి చేస్తాను.
  జనార్ధన మహర్షి కథలకు, కవితలకు ఇస్తున్న పురస్కారం ఆయా రచయితలకు మంచి ప్రోత్సాహం. ఒక సంవత్సరంలో వచ్చిన ఈ కథలు, కవితలు సంకలనంగా వస్తే మంచి కథల సంకలనం అందించిన వారవుతారు. నా అభిప్రాయాలు వెలిబుచ్చుకోవడానికి వేదిక కల్పించిన (సమధానాల ద్వారా) 'ప్రస్థానం' మాసపత్రికకు ధన్యవాదాలు.

**- పోపూరి సురేష్‌బాబు**

సెల్ : 98815628692

## పాత సాహిత్యం పట్టించుకోవాలి

ప్రస్థానంలో 'సాహిత్యరంగంలో తీరుతెన్నులు'పై అభిప్రాయాలు ఆహ్వానించడం హర్షణీయం, అభినందనీయం.

ఆస్థాన రచయితల అభిప్రాయాలు, పాఠకులు మరియు సాహిత్య అభిమానులు స్పందించవలసిన అవసరముంది.

దాదాపు ఇరవై ఐదు అంశాల గురించి స్పందన ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా స్పందించారు.

నేను దాదాపు ప్రస్థాన ప్రారంభ సంచిక నుండి అభిమాన పాఠకుడిని.

చేతికందిన ఏ భాష గ్రంథమైనా ఉర్దూ, హిందీ, తెలుగు, ఇంగ్లీషు, కొంచెం మరాఠీ, కన్నడ పుస్తకాలను, సాహిత్యాన్ని ఆస్వాదిస్తుంటాను. ఇక వీలును బట్టి నవలలు గాని , కావ్య పుస్తకాలు గాని కొనడమే. కుటుంబ సభ్యులను కూడా చదివిస్తాను. నా కథలు, గేయాలు సాహితీ ప్రస్థానంలో ప్రచురింపబడి 'అష్టా దశ కథానికలు', ఆంతరవళి ఇంకా అముద్రిత సంపుటాలుగా వున్నాయి. 'యాజ్ ఎ ఫీల్' ఆంగ్ల కవితా సంపుటి వెలుగులోకి వచ్చాయి. పెద్దవాళ్ళతో, చిన్నవాళ్ళతో కలివిడిగా ఉంటూ నా సందేహాలు, వారి సందేహాలు చర్చించుకునే అవకాశం కలిగిస్తాం. స్థానిక సాహితీ సభలలో పాల్గొనడం, వాటిలో ఎక్కువ కాలహరణం గురించి బాధపడుతుంటాను. దాదాపు ఏ సాహిత్య సభ అయినా రెండు మూడు గంటలు ఆలస్యంగా ఆరంభింపచేయడం సబబు కాదు. ఆహ్వానితులను ఇబ్బంది పెట్టడం, ముఖ్య అతిథిగారు వచ్చే వరకు నిరీక్షించడం సభ్యత అయినా రెండు మూడు గంటలు భరింపలేని కాలయాపన. పదవీ విరమణీయులకు కాలక్షేపం కావచ్చు. మరి ఇతరుల మాట ఏంటి? ఇక అధ్యక్షుల వారు ఏ అంశముపై మాట్లాడినా కాలేజీలో చర్చించే పాఠ్యాంశంగా ఉండటం సహజమైంది. క్లాసులో కూర్చున్నట్లుగా ఉంటుంది. ఈనాటి సాహితీ పత్రికలు రాజకీయ అండదండలతో నడుస్తుండటం వల్ల ఆయా రాజకీయ వాతావరణంలోకి ఆహ్వానితులు సర్దుకుపోయే ప్రమాదం కనబడుతుంది. ఒక్కొక్కసారి విషయం ప్రక్కకు లాగబడినా ఆశ్చర్యపోవలసిన అవసరం లేదు.

మన సాహిత్య విలువ గురించి ఎవరెంత చెప్పినా తరగని సంస్కృతి మనది. గ్రంథాలయాలు నిధులు లేవనో, నిధులు మింగే మోసాల కోవిదుల వల్ల బూజులు వేలాడుతూ, విరిగిన బల్లలు, ఊగిసలాడే కుర్చీలు ఆహ్వానిస్తుంటాయి. కార్యక్రమమునాడైన దుమ్ము దులిపి శుభ్రత, శుచి కూడా పాటించని గ్రంథాలయ సిబ్బంది, మైకులు పనిచేయవు. తిరగని ఫ్యాన్లు, సాహిత్య సభల్లో సాహిత్యమెంత? సామాజిక హితమెంత?

ఇక నేటి రచయిత రచనలు గుర్చి రాశి పెరుగుతూనే వుంది. జేబు సంస్థలు అందుకు దోహదమిస్తున్నాయి. పాత సాహిత్యం గురించి పట్టించుకునే నాథుడే లేడు. ఈ మధ్యకాలంలో సాహిత్య అనుబంధాలు అన్ని పత్రికల్లో వస్తున్నాయి. సాహితీ, విద్యావేత్తల విషవలయంలో నేడు సాహిత్య ప్రపంచం సాగుతుంది. సెల్‌కు సంస్కారం పెరిగిపోతుంది. ఇదివరకు రచయితలకు పారితోషికం యిచ్చేవారు. ఇప్పుడు రచయితల శ్రమను దోచుకునే పత్రికలు కోకొల్లలుగా వస్తున్నాయి. కనీసం రెండు వందల రూపాయల డిటిపి పోస్టల్ ఖర్చులు అవుతున్న రోజుల్లో పోటీల పేరుతో, చర్చల పేరుతో రచనలను ఆహ్వానిస్తున్న పత్రికలకు పాదాభివందనం. రచయితల బలహీనతను తమ వ్యాపారానికనుగుణంగా మార్చుకుంటున్న కుహనా సాహితీ పత్రికలు చేస్తున్నది సాహితీ సేవనా, సామాజిక సామూహిక సాహిత్య హత్యేనా? ఏది ఏమైనప్పటికీ స్పందన మంచి పరిణామము.

**కొలనుపాక మురళీధరరావు**
**సెల్ : 9247159203**

---

## నాకూ కావాలి

### - విజయభాను కోటి



నాకూ కావాలి ఒక పచ్చని తురాయి చెట్టు నీడ
నాకూ కావాలి విరహాన్ని ఓర్చే రెప్పల నీడ
ఒక అనుభూతి... చెంపల కెంపులను సాన పెట్టేది
ఒక చక్కెర చూపు... గుండె గదుల్లో తీగ పాకం పట్టేది
నాకూ కావాలి రవ్వంత నిప్పు
నాకూ కావాలి చినుకంత తడి
ఒక తిన్నె లాంటి వెన్నెల... మెత్తటి చప్టా కట్టి, నా కథలు వినేది
ఒక ప్రశ్న.... నా జవాబులన్నింటిని చుట్ట చుట్టి గోదార్లో విసిరేసేది
నాకూ కావాలి పరుగెత్తించే ఒక క్షణం
నాకూ కావాలి ఎద మూలల్లో తప్పిపోయిన ఉద్యానవనం
ఒక జలపాతం... నా హృదయ రాగాలను తనతో తీసుకుపోయేది
ఒక వెచ్చటి కంబళి... నా నరాలలోని మంచును ఆవిరి చేసేది
నాకూ కావాలి నా పైన విస్తరించిన ఆకాశం
నాకూ కావాలి పల్చటి ఆశల రెక్కలు
ఒక రూపం.. ఆత్మను సైతం ఆరాధ్యదాయకం చేసేది
ఒక చిక్కటి గొంతు...నా అంతర్లీన భావాలను బహిర్గతం చేసేది!!!

# కొన్ని కవితలు - ఒక పరామర్శ




విజయనగరం సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఉగాది జనకవనం సభ

మార్చి 22వ తేదీన గురజాడ కేంద్ర గ్రంథాలయం, విజయనగరంలో 'సాహితీ స్రవంతి' ఆధ్వర్యాన జరిగిన ఉగాది కవి గాయక సమ్మేళనంలో చదివిన కొన్ని కవితల 'పరామర్శ' ఇది.

కవిత్వం 'ఒక జీవనది'. ఒక గాఢమైన అనుభూతి. మరింత గాఢమైన అనుభవమే దాని 'కేంద్ర స్థానం'. కవితా వాక్యాలు 'అలలు'. అవి ఒకానొక గెలుపు తీరాన్ని చేరుకోవాలని ఆరాటపడే 'ఆలోచనా తరంగాలు'.

ఆ గెలుపు తీరం ఒక సామాజిక ప్రయోజనమైతే అంతకన్నా ఆ కవిత్వానికి పరమావధి వుండదు. మానవజాతి ప్రయాణంతో పాటు సాగే కవిత్వపు ప్రయాణం కూడా కొన్ని ఎగుడు దిగుడులకు లోను కావలసి వుంటుంది. అయినంత మాత్రాన దాని చూపు మాత్రం ప్రగతిశీలత వైపే వుండాలి. ఆ బాధ్యత ఆయా తరాలలో వున్న కవులదే!

దీన్ని నిరూపిస్తూ....

'అదృశ్య చిత్రం' కవిత రాసిన మానాపురం రాజా చంద్రశేఖర్...

ఇప్పుడు జీవితాన్ని కోల్పోవడం కన్నా
నిజమైన విషాదం ఎక్కడుంది!
మనిషి శూన్యంగా మారి ప్రయాణిస్తున్నంత సేపూ
చివరకు మనకు మిగిలేది
ఈ చితాభస్మమే కదా...!
అందుకే దగ్ధమవ్వాలి
దూరమైన దారులకూ దగ్గరవ్వాలి!
అని...

ఇవాళ మారుతున్న మానవ విలువలకు, వికటిస్తున్న ఆలోచనా ధోరణులకు... నిర్వేదన పడి కవిత్వీకరిస్తారు. వికలమవుతున్న మనుషులను దగ్గర చేయాలనే దృష్టి కోణం కల్గి వుండాలని బోధపరుస్తారు.

నేనూ నిజమే!
నువ్వూ నిజమే!
మనిషి మనిషిగా బతకడమే
ఇవాళ ఒక అబద్ధం!!
అంటూ కవితా వ్యాఖ్యానం చేస్తారు.

కవయిత్రి 'చెళ్ళపిళ్ళ శ్యామల' ఇదే విషయాన్ని మరింత గాఢంగా కవిత్వీకరిస్తూ... 'వెతుకులాట'గా మన ముందుంచుతారు.

ఒంటరి మనసును శృతి చేసి
స్నేహగీతం ఆలపించే
గొంతు కోసమే నా వెతుకులాట! అంటారు.

అలాగే... / దోపిడీ పరమ రూపాన్ని చెప్పి... దాన్నుంచి బయటపడాల్సిన తక్షణ అవసరత వుంది / అని నొక్కి చెప్తారు.

గడ్డినీ... గాలినీ కూడా
భోంచేసే బకాసురుల
కబంధ హస్తాల్లో
చిక్కుకున్న జాతిని
రక్షించే
మనిషి కోసమే నా వెతుకులాట!

ఆ వెతుకులాటలో 'మానవజాతి సమస్తం' జయప్రదం కావాల్సిన ఆవశ్యకత వుంది. 'సామూహిక సాఫల్యత' కోసం... కదలాల్సిన అనివార్యతా వుంది.

మరో కవి 'మొయిద శ్రీనివాసరావు' 'యానామంటే...!' కవితలో...

నేడు యానాంను చూస్తుంటే..
సిరామిక్ పలక సైతం
కడుపు మంటతో కాలే కవచంలా కనిపిస్తుంది
ఏ ఆకలి పేగు అరుపు విన్నా
మూగబోయిన మిల్లు సైరన్‌లా వినిపిస్తుంది

అని... కార్మికుల హోరెత్తే సాగర ఘోషని కవిత్వీకరిస్తూ... యానాంలో కార్మికులు తీసుకున్న పోరాట రూపాన్ని బలపరుస్తారు.

యానామంటే
గద్ద తలను సైతం
ఎగిరి ఎగిరి తన్నడానికి సిద్ధంగా వున్న
కత్తెర పిట్ట!!

అని... తనను తాను రూఢీ పరచుకుని... మనల్నీ రూఢీ చేసుకోమంటారు..

పి. లక్ష్మణరావ్.. 'వార్తా సూర్యుడు' కవితలో...

లోకానికేమో తెలియదు గాని
మాకు మాత్రం ఉదయించే సూర్యుడు
'మా పేపర్ బాయ్'

రోజూ.. వార్తా విశేషాలను మోసుకొచ్చే 'పేపర్‌బాయ్'ని తన ఆత్మీయ నేస్తంగా భావిస్తూ... కవి...

ఆ సూర్యుడు ఒక్కో కిరణాన్ని
భూమి పైకి పంపుతున్నట్లే..
మా సూర్యుడు ఒక్కో పేపర్ని
ఇంటి ముందు గిరాటు వేస్తాడు

పేపర్ బాయ్‌ని సూర్యునితో పోల్చడం... పేపర్‌కు కిరణానికి పోలిక తేవడం... ఒక చైతన్యవంతమైన వ్యక్తీకరణ.

రెడ్డి, శంకర్రావు 'ఏది! ఆ జనపదం!' అన్న కవితలో.. స్వచ్ఛమైన మణిపూసలాంటి నా పల్లెంటె నాకిష్టమనీ, కొబ్బరి చెట్టుని చీరలా చుట్టుకున్న కోనేరు గట్టంటే ఇష్టమనీ... చెబుతూ..

వృత్తులన్నీ వికసించీ
వినీలాకాశంలో చుక్కల్లా
నిత్యం వెలుగుతుండాలనే
నా ఆశలన్నీ....
ఒక్కసారిగా పేకమేడలై కూలిపోయాయి!

వర్తమాన కాలంలో... భూబకాసురుల వలన, పరిశ్రమాధిపతుల వలన... వాళ్ళ వాళ్ళ దోపిడీ వలన... పల్లెలు సహజత్వాన్ని కోల్పోయి.. శిథిలావస్థలోకి చేరిపోవడాన్ని సహించలేక దాన్నే కవిత్వీకరిస్తారు.

పల్లె ప్రజలు... ప్రళయ భీకరమై తిరగబడాలనీ, పెను సునామిలా విజృంభించాలని 'కవి' అభిలషిస్తారు.

మరో కవి 'గోరుగంతల రాజశేఖర్' , 'చేజారిపోతోంది' అన్న కవితలో...

విపరీత పోకడలు పోతున్న ఆధునిక కాలంలో 'ఉగాది' యాంత్రికమైపోతుందని... ఆ మాట కొస్తే జీవితమంతా యాంత్రికత నిండి... యాంత్రికతే జీవితమవుతుందని ఆవేదన పడతాడు... ఆక్రోశిస్తాడు... చివరకు 'ఆలోచించమంటాడు.'

పండగ పూట సెలవు అవసరమాని? యోచిస్తున్న...
కార్పొరేట్ యాజమాన్యాలు.
ఇస్తే చాలు ముసుగు తన్నేద్దామంటూ ఉద్యోగస్తులు!
'ఇదీ ప్రపంచీకరణ మహిమే!' అని...


## నవలా పురస్కారానికి ఆహ్వానం

వరంగల్‌కు చెందిన సహృదయ సాహితీ సంస్థ ఒద్దిరాజు సోదర కవుల స్మారకార్థం 2011 సంవత్సరానికి గాను 'సహృదయ సాహితీ పురస్కారం' అందివ్వనున్నట్లు ఆ సంస్థ ప్రధాన కార్యదర్శి డా॥ తుమ్మారి లక్ష్మణరావు ఒక ప్రకటనలో తెలిపారు. ఆయా రచయితలు తమ పుస్తకాలను మూడు కాపీలను డా॥ టి. లక్ష్మణరావు, 2-2-492, కిషన్‌పురా, హనుమకొండ-506 001, చిరునామాకు మే నెల 25 లోపుగా పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 0860-2573563, 9030972224 ద్వారా సంప్రదించవచ్చు.


ప్రపంచీకరణ భూతానికి లోను కానిదేదీ లేదని' అంటారు.

'ఆంధ్ర సంస్కృతి మాత కరకమలాల నుంచి
ఏదో అమూల్యమైన రత్నం
చేజారిపోతున్నట్లుంది'

సహజ సిద్ధమైన ఉగాదిని కోల్పోవడమంటే... మన జీవితాల్లో నున్న అమూల్యమైన సారాన్ని కోల్పోవడమే అని అంటారు.

కవయిత్రి 'ఇల్ల ప్రసన్న లక్ష్మి' ఉగాది కవితలో...
ఏరువాక సాగే దిశలో...
యాంత్రికత ఎరగని 'రైతన్న' హృదిలో మెదిలే
పైరుగాలి పచ్చదనం 'ఉగాది'
కరువు రక్కసి కోరల్లో చిక్కుకున్నా..
కలిమిలేముల కలబోతను
కంబలిగా చుట్టుకున్న వెచ్చదనం 'ఉగాది'

అంటూ... 'ఉగాది' అసలు గమ్యాన్ని చెబుతూ ఉగాది ఇచ్చిన ఉత్సాహంతో 'రైతు' కష్టాలు కడగండ్లు నుంచి నిబ్బరంగా ముందుకు అడుగు వేయాలనే భరోసాని రాశారు.

బొత్స గౌతంనాయుడు 'అందరివాడు' కవితలో మారుతున్న ప్రపంచ గమనంలో రిక్షావాడి జీవితం ఎంత దుర్భరతలో మునిగిపోతుందో కవిత్వీకరిస్తారు.

ఆటో రిక్షాలు, సిటీ బస్సులు
తనకు పోటీగా ఎన్నొచ్చినా
ఏళ్ళ తరబడి తను తొక్కిన
రిక్షానే నమ్ముకుంటాడు
తన శ్రమనే అమ్ముకుంటాడు
ఎవరికీ పట్టనివాడు

అందరికీ కావలసిన 'అందరివాడు' అని... రిక్షావాడిని అందరివాడుగా ప్రకటిస్తూ... ఆ శ్రమకు గుర్తింపు కావాలని... శ్రమజీవుల పక్షాన నిలబడతారు.

మరో కవయిత్రి... కథకురాలు ఇనుగంటి జానకి 'జ్యోతి' కవితలో... 'నీలో వున్న అహంభావమే 'చీకటి'. ఆ చీకటి నుంచి బయటకొస్తే అంత వెలుగే' అని అంటారు.

సిహెచ్.వి. లక్ష్మి 'అలనాటి నా పల్లెసీమ' అన్న కవితలో 'పల్లె జ్ఞాపకాలను నెమరువేసుకుంటూ... పల్లె సహజత్వాన్ని తెలియబరుస్తూ... అదే పల్లె ఇప్పుడు ప్రపంచీకరణ క్రూరచూపుకి బలౌతుంది' అని ఆవేదన పడతారు.

ఇనపకుర్తి చిన సత్యనారాయణ 'జలం' కవితలో... గుక్కెడు నీళ్ళ కోసం జనం... నింగి వైపు ఆశగా చూస్తున్నారనీ... ఆ నీళ్ళ కొరకే బాంధవ్యాలను మరచి మరీ కొట్టుకుంటున్నారనీ ఆవేదనతో కవిత్వీకరిస్తారు.

మనుగోటి రమేష్ 'శ్రీ నందన ఉగాది' బులుసు సరోజినీదేవి 'రాయంచలు', వల్లూరు అయోధ్య రామయ్య 'నందన నామ ఉగాది' ఎ. శ్రీను 'కష్టజీవి' అనిల్ 'నేను సైతం' ఇలా మొత్తం ఓ నలభై మంది వరకూ తమ తమ కవితలతో కవి గాయక సమ్మేళనంను విజయవంతం చేశారు.

మొత్తానికి 'విజయనగరం' జిల్లాలో ఎప్పుడూ 'సాహితీ సౌరభాలు' వెదజల్లబడుతూనే వుంటాయని నిరూపించారు. చివరగా గీతాగానం చేశారు.

**– చంద్రికారాణి, బాలసుధాకరమౌళి**

# మెరుగు




విజయనగరం సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో అంబేద్కర్ జయంతి సభలో మాట్లాడుతున్న చీకటి దివాకర్

ఏప్రిల్ 5న, 14న జగజ్జీవన్‌రామ్, అంబేద్కర్ జయంతుల్ని పురస్కరించుకొని సాహితీ స్రవంతి 'మెరుగు' కార్యక్రమాలు గురజాడ వారి స్వగృహంలో జరిగాయి. గుంటూరు నుండి రవికృష్ణ, బొమ్మిడాల కృష్ణమూర్తి, చంద్రమోహన్ ఏప్రిల్ 5న విచ్చేశారు. రవికృష్ణ మాట్లాడుతూ విజయనగరం, గుంటూరు జిల్లాలకు ఉన్న అవినాభావ సంబంధాన్ని తెలియజేస్తూ పూసపాటి రాజులది పాత గుంటూరుని, విజయనగరం సాంస్కృతిక రంగంలో ఖ్యాతి పొందడానికి పూసపాటి రాజవంశీయులు ఒక కారణమన్నారు. విద్యార్థులకు త్రిభాషా విధానాన్ని నిర్వహించాలని, 500 ఏళ్ళ క్రితమే ఈ విధానాన్ని శ్రీకృష్ణదేవరాయలు అమలు పరచి మూలపురుషుడైనాడని, చరిత్రలో తెలుగు పరిశోధన చాలా దిగువ స్థాయిలో ఉందని, అందుకే సాహిత్య విద్యార్థికి తప్పనిసరిగా చరిత్ర తెలుసుండాలన్నారు. సాహిత్యానికి, చరిత్రకు ఒకదానికొకటి పెనవేసుకొనే సంబంధముందని ఆనాటి కవుల రచనలను చదివినట్లయితే తెలుస్తుందన్నారు. చరిత్ర అనే పునాది లేకపోతే సరైన అవగాహన ఉండదన్నారు.

పి.వి.ఎల్. సుబ్బారావు మాట్లాడుతూ హిందీ కవులలో కబీర్ ఏ ప్రాంతంలో పర్యటిస్తే ఆ ప్రాంత భాషలోనే కవిత్వాన్ని చెప్పేవారని, చరిత్ర తెలుసుకొని అధ్యయనం చేయాలని అన్నారు.

చీకటి దివాకర్ మాట్లాడుతూ సాహిత్యం, సమాజం ఒకదానిపై ఒకటి ఆధారపడి ప్రగతిశీల దిశగా వెళ్ళాల్సిన అవసరముందని, సాహిత్య రంగంలో కృషి చేస్తున్నామంటే సమాజాభివృద్ధి జరగాలని ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

యు.ఎ. నరసింహమూర్తి, ద్వారం దుర్గాప్రసాద్, ఎస్.వి. శర్మ, రమేష్, ఇనుగంటి జానకి, బొమ్మిడాల కృష్ణమూర్తి, చంద్రమోహన్ ఇలా కవులు, సాహిత్యాభిమానులు తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు.

అంబేద్కర్ జయంతినాడు చీకటి దివాకర్ మాట్లాడుతూ.. మానవ నాగరికత అభివృద్ధి చెందిన క్రమంలో ఆయా కాలాల భౌగోళిక, భౌతిక పరిస్థితులు అభివృద్ధి అయ్యాయనీ, ప్రపంచవ్యాప్తంగా చూసినట్లయితే నల్లరంగు వారిని తక్కువగాను, తెల్లరంగు వారిని ఎక్కువగాను చూసేవారని, బానిస సమాజం నుండి ఈనాడు సమాజం అభివృద్ధి చెందిందని, భారతదేశం గర్వించదగినవి ఎన్నో ఉన్నప్పటికి కులవివక్ష తోటి మనిషిని తాకడానికి ఇష్టపడని సంస్కృతి వలన సుదీర్ఘ పోరాటం జరిగిందని, స్వాతంత్ర్య పోరాటంతో పాటు అనివార్యంగా కులవివక్షపై కూడా సాగిందన్నారు. వేమన, గురజాడ, జాషువా వంటి వారు కులవివక్షను గర్హించారని, జ్యోతిరావుపూలే తన జీవితాన్ని దళితుల అభ్యున్నతికై ఎన్నో రకాల సవాళ్ళను ఎదుర్కొంటూ ఎదురొడ్డారన్నారు.

ఇందులో పాల్గొన్న కవులు, గాయకులు ఈనాటికి కొనసాగుతున్న అంటరానితన అమానుషాల్ని వ్యతిరేకిస్తూ, కుల వ్యవస్థ పోయి అన్ని కులాలు ఒక్కటే అనే సమభావన రావాలని కాంక్షిస్తూ కవితలు, పాటలు పాడారు.

# ఘనంగా 'నందన' ఉగాది కవి గాయక సమ్మేళనం

"తెలుగు సంవత్సరాది ఉగాది పండుగను గొప్ప వేడుకగా జరుపుకోవడం ద్వారా మన తెలుగువారి సంప్రదాయం, సంస్కృతులను కాపాడుకోగలమని, షడ్రుచుల సమ్మేళనంలా ప్రతి మనిషి జీవితంలో ఒడిదుడుకులను తట్టుకొని సుఖంగా జీవించాలని సాహితీ స్రవంతి సభలో మాగంటి సూర్యం అన్నారు. నందన నామ సంవత్సర ఉగాది కవి సమ్మేళనాన్ని మార్చి 23 ఉదయం 10 గంటలకు స్థానిక లిటిల్ ఫ్లవర్స్ విద్యా ప్రాంగణంలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఘనంగా నిర్వహించారు. సభకు మాల్యశ్రీ అధ్యక్షత వహించి సభ నుద్దేశించి ప్రసంగించారు. ముందుగా కార్యదర్శి తాతోలు దుర్గాచారి సభను ప్రారంభిస్తూ దేశభక్తి గీతాన్ని ఆలపించారు. అనంతరం జరిగిన కవి సమ్మేళనంలో ఎన్.సి.హెచ్. చక్రవర్తి, శ్రీధిరాల వెంకటాచారి, డా॥ చింతలపూడి వెంకటేశ్వర్లు, ఎస్. ధనుంజయుడు, కె. రామకృష్ణ ప్రసాదరాజు, శ్రీనివాస్, బి. రమేష్, ఆవుల సుబ్బారావు, అరుణ కుమారి, జయలక్ష్మి, అనూష, నీహారిక తదితరులు పాల్గొని 'నందన' నామ ఉగాదిని కవితా గానాలతో స్వాగతించారు. ఇంకా ఈ సభలో అనేకమంది సాహిత్యాభిమానులు పాల్గొని సభను జయప్రదం చేశారు. చివరగా దుర్గాచారి వందన సమర్పణ చేశారు.

# పాలకుల విధానాలు వ్యాపారం కోసమే

పాలకులు రూపొందిస్తున్న విధానాలు వ్యాపారం కోసం, లాభం కోసం కాబట్టే సమాజంలో అసమానతలు పెరుగుతున్నాయని, సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ అన్నారు. అంబేద్కర్ జయంతి సందర్భంగా సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ఏప్రిల్ 13న సాహితీ స్రవంతి నగర కమిటీ ఆధ్వర్యంలో 'వివక్ష – ప్రతిఘటన' అంశంపై జరిగిన సదస్సుకి వి.వి.ఆర్. శాస్త్రి అధ్యక్షత వహించగా వొరప్రసాద్ మాట్లాడారు. కాలం ఎంతో ఆధునికతను సంతరించుకుందని, ప్రపంచీకరణ యుగంలో హైటెక్ పోకడలతో సమాజం అభివృద్ధి చెందుతోందని, భూమండలం నుండి చంద్రమండలాన్ని వీక్షించగల సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకున్న సమయంలోనూ వివక్ష గురించి మాట్లాడుకోవడం విడ్డూరంగా వుందన్నారు. సమాజం కొత్త పుంతలు తొక్కుతున్న సమయంలో కూడా దళితులను అంటరానివారిగా భావించడం సరికాదన్నారు. దళితుల్ని నేటికీ దేవాలయాల్లోకి రానీయకపోవడం, హోటళ్ళలో రెండు గ్లాసుల పద్ధతి కొనసాగడం దారుణమన్నారు. దీన్ని బట్టి అభివృద్ధి అనేది కొందరికి మాత్రమే అనే విషయం అర్థమవుతోందన్నారు. అభివృద్ధి – వివక్ష జమిలీగా సమాజంలో కొనసాగుతున్నాయని, దీన్ని పాలకులు ఉద్దేశపూర్వకంగానే ప్రోత్సహిస్తున్నారని విమర్శించారు. పాలక వర్గాలు కుట్రపూరితంగానే సమిష్టి భావాన్ని దెబ్బతీసి వ్యక్తివాదాన్ని అభివృద్ధి చేస్తున్నారన్నారు. ఈ అసమానతలకు వ్యతిరేకంగా సాహిత్యకారులు చైతన్యవంతమైన భావజాలాన్ని ప్రజల్లోకి తీసుకుపోవాల్సిన అవసరం ఉందన్నారు.

### ఉత్తేజంగా జనకవనం

జనకవనం కార్యక్రమాన్ని సాహితీ స్రవంతి నగర కమిటీ సభ్యులు శాంతిశ్రీ, జి. నరేష్ నిర్వహించగా పలువురు రచయితలు వివక్ష – ప్రతిఘటన అంశంపై కవితలు చదివి వినిపించారు. కులం ఒక కుట్ర, మతం ఒక మత్తు అన్న కవితను ఎస్. వెంకటనారాయణ చదివి వినిపించగా, వీరే ఎక్కడ చూడాలను కుంటే అక్కడ కనిపిస్తారు అన్న కవితను నాగ శిరీష చదివారు. 'అశ్లీలపు ఆలోచనలను ఒళ్ళంతా కప్పుకుని చెడు దారిన పడిన యువతకు చెదలెన్నో పడితే, అజ్యాన్ని పోసి అగ్ని కీలల్ని ఎగదోసినట్టు రెచ్చగొట్టేతనాన్ని రగిలిస్తున్న దేశం ఇదేనా ... ఇదేనా.. మన భారతదేశం అను గేయం పిఎన్ఎం నగర అధ్యక్షుడు సైదులు పాడారు.

ఈ కార్యక్రమంలో కుల వివక్షను ధనుమాడుతూ వచ్చిన కవితలు మనుధర్మంపై బరి గీసి యుద్ధానికి సై అన్నట్లుగా ఉత్తేజాన్ని నింపాయి.

ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతి నగర కార్యదర్శి జి. యాదగిరిరావు, తంగిరాల చక్రవర్తి, నరహరి, వెంకటి, నరసింహమూర్తి, పి. సుబ్బారావు, ఆచార్య నరేంద్ర, ఆలువాల సురేష్, రాజా, కనకాచారి, భాస్కర్, రమణ, సైదులు, నరేష్, పెద్దూరి వెంకటదాసు, మౌనశ్రీ మల్లిక్, కె. లక్ష్మయ్య తదితరులు కాగా, కవి సమ్మేళనంలో కవయిత్రుల్లో సింహాద్రి నాగశిరీష, జి. రాణి, వి. జయశ్రీ, శాంతిశ్రీ, రత్నా మహీధర్ తదితరులు కవితలు చదివారు.



సాహితీ స్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో ఏప్రిల్ 13న జరిగిన "వివక్ష – ప్రతిఘటన" జనకవన సదస్సులో మాట్లాడుతున్న సభాధ్యక్షులు వి.వి.ఆర్. శాస్త్రి




మార్చి 23న కొత్తపేట, కళాసాహితీ వారి ఉగాది సాహిత్య కార్యక్రమంలో డా॥ అద్దేపల్లి రామమోహనరావుకి అంకం వీరభద్రరావు స్మారక సాహిత్య పురస్కారం అందజేస్తున్న కవి, రచయిత ఎస్.ఆర్. పృథ్వి



'స్రవంతి' మాసపత్రిక సంపాదకురాలు డా॥ జి. నీరజ హిందీలో రచించిన 'తెలుగు సాహిత్య : ఏక్ అవలోకన్' అనే గ్రంథాన్ని దక్షిణ, భారత హిందీ ప్రచార్ సభా కుల్ సచివ్ (సబ్ రిజిస్ట్రార్), పో. దిలీప్ సింగ్ హైదరాబాద్‌లో ఏప్రిల్ 1న ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో చిరంజీవి సాహితి, వి. కృష్ణారావు, కృతి స్వీకర్త జి. శ్రీకాంత్, దక్షిణ భారత్ హిందీ ప్రచార్ సభ ఆంధ్ర శాఖా అధ్యక్షురాలు ఎం. సీతాలక్ష్మి, డా॥ జి. నీరజ, ప్రొ॥ దిలీప్ సింగ్, డా॥ రాధేశ్యాం శుక్ల్, ప్రొ॥ ఎన్. గోపి, ఎస్.కి. హలేమని, భగవాన్‌దాస్ జోపట్, ప్రొ॥ ఋషబ్ దేవ్ శర్మ

# ఉగాది జనకవనం

హైదరాబాద్‌లో ఇ.సి.ఐ.ఎల్. సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో మార్చి 22న సాయంత్రం 6 గంటలకు ఇ.సి.ఐ.ఎల్. స్టాఫ్ & వర్కర్స్ యూనియన్ ఆఫీస్‌లో నందన నామ సంవత్సరంను ఆహ్వానిస్తూ "ఉగాది జనకవనం" ఇ.సి.ఐ.ఎల్. ఉద్యోగులచే కవి సమ్మేళనం జరిగింది. ఉగాది జనకవనం సభకు ఇ.సి.ఐ.ఎల్. టెక్నికల్ డైరెక్టర్ ఎన్.ఎస్.ఎస్. ప్రసాదరావు జనకవనం ప్రారంభించారు. ప్రముఖ పండితులు మోతుకూరి నరహరి ప్రసంగించారు. ఇ.సి.ఐ.ఎల్. కవులు 15 మంది ఉగాది సందర్భంగా నందన నామ సంవత్సరాన్ని ఆహ్వానిస్తూ కవితలను చదివి వినిపించారు. ముఖ్య అతిథి ఎన్.ఎస్.ఎస్. ప్రసాదరావు మాట్లాడుతూ నూతన సంవత్సరంలో ఇ.సి.ఐ.ఎల్. మరిన్ని మంచి ఫలితాలను సాధిస్తుందని అభిలషించారు. కర్మాగారాలలో యంత్రాలతో కుస్తీతో పాటు మానసిక ఆహ్లాదం కొరకు కళలు దివ్య ఔషధంగా పనిచేస్తాయన్నారు. కవిత్వం మనిషికి జ్ఞాన కవాటాలను తెరుస్తుందన్నారు. కష్టించి పనిచేసి ఎ.ఎస్.రావు స్థాపించిన ఇ.సి.ఐ.ఎల్.కు వన్నె తేవాలని కోరారు. మోతుకూరి నరహరి మాట్లాడుతూ సాహిత్యం మనిషికి సన్మార్గమిస్తుందన్నారు. తెలుగు సాహిత్యంలో భేదాలు లేవని త్రిలింగ దేశం నుండి ఆంధ్ర పర్యాయ పదాలుగా వున్నాయన్నారు. సాహితీ స్రవంతి నగర కార్యదర్శి జి. యాదగిరి మాట్లాడుతూ ఇ.సి.ఐ.ఎల్.లో కవులు సాహిత్య పురోగమనానికి కృషి చేయాలన్నారు. సభ అనంతరం అభ్యుదయ ఆర్ట్స్ వారిచే "రూల్స్ ఒప్పుకోవు" నాటికను ప్రదర్శించారు. తల్లిదండ్రుల పట్ల పిల్లలు వ్యవహరిస్తున్న తీరును హృద్యంగా ప్రదర్శించారు. సోమయ్య, షైలారాణి, పాండు, రాజు మోహన్‌రాజు, నారాయణ గొప్పగా నటించారు. సభకు కన్వీనర్ గిన్ని ఆనందరావు అధ్యక్షత వహించారు. తిరునగరి మురళి కార్యక్రమాన్ని నిర్వహించారు. కృష్ణంరాజు వందన సమర్పణ చేశారు.



మార్చి 22న హైదరాబాద్ ఇ.సి.ఐ.ఎల్‌లో జరిగిన ఉగాది జనకవనం వేదికపై మాట్లాడుతున్న మోతుకూరి నరహరి



ఏప్రిల్ 5న హైదరాబాద్‌లో రాష్ట్ర చిన్న, మధ్యతరహా దినపత్రికల సంఘం సభ. ఈ సందర్భంగా జరిగిన ఎన్నికలలో గెలిచినవారు చిత్రంలో కోశాధికారి పి. దయానంద్, ప్రధాన కార్యదర్శి జైస దేవదాస్, అధ్యక్షులు కె.ఎస్. రంగసాయి, ఉపాధ్యక్షులు లాయక్ అలీఖాన్ రషీద్, సహాయ కార్యదర్శి బి.ఎం. ఆనంద్




అనంతపురంలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఉగాది కవి సమ్మేళనం



ఏప్రిల్ 2న గోల్డెన్ స్టార్ యూత్ కల్చరల్ ఆర్గనైజేషన్ వారు కళా సుబ్బారావు వేదికపై ప్రముఖులకు సాహిత్య రత్న పురస్కారాలను ప్రదానం చేసిన దృశ్యం. చిత్రంలో బింగి నరేందర్ గౌడ్, వనం శంకరయ్య, మల్లవరపు విజయ, గిరిరాజు విజయలక్ష్మి, డా॥ సి. నారాయణరెడ్డి, దాత సిరి గాదె శంకర్



దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఖైరతాబాద్, హైదరాబాద్ నందు దూరవిద్య ఎం.ఎ. హిందీ విద్యార్థులకు కాంటాక్ట్ తరగతులు మరియు ఉపన్యాసమాల కార్యక్రమం యొక్క ముగింపు సందర్భాన గ్రూప్ ఫోటో. డా॥ పేరిశెట్టి శ్రీనివాసరావు - సహాయ సంచాలకులు, ప్రొ॥ ఋషబ్ దేవ్‌శర్మ, గురుదయాళ్ అగర్వాల్ తదితరులు

# చైతన్యపరిచేదే సాహిత్యం

"రాష్ట్రంలో చాలామంది అమెరికానే దేశంగా, ఇంగ్లీషునే భాషగా, కంప్యూటరే టెక్నాలజీగా, పరీక్షంటే 'ఎంసెట్'గా భావిస్తున్నారని, వ్యవస్థ ఈ విధంగా మారటం చాలా బాధాకరమని" రాళ్ళబండి కవితా ప్రసాద్ అన్నారు. ఖమ్మం పట్టణంలో ప్రజలు సాహిత్యం అనే అంశంపై ఆదివారం మీకోసం (బివికె) ఏర్పాటు చేసిన సదస్సులో ఆయన మాట్లాడారు. మానవ విలువల కంటే వస్తు విలువల ప్రాధాన్యం పెరిగి మానవ సంబంధాలను దూరం చేస్తున్న పాశ్చాత్య నాగరిక పోకడలకు ఎదురొడ్డేదే సాహిత్యం. ప్రజలను సరియైన మార్గంలో నడిపిస్తుందని, అందుకు గత కవులు, రచయితలు ఆ కాలానికి తగ్గట్టు కృషి సల్పారని, కాని నేటి పరిస్థితులు అందుకు భిన్నంగా వున్నందున కవులు, రచయితలు స్వరం గట్టిగా, ఘాటుగా, గాటు వేసేదిగా కూడా వుండాలని, పాలక వర్గాలకు సూటిగా తగిలేలా సాహిత్య వ్యవసాయం చేయాల్సి వుందని పేర్కొన్నారు. పదవులు వుంటాయో, పోతాయో అనే అయోమయంలో పాలకులుంటూ, ప్రజల సమస్యలను పట్టించుకోక మల్లగుల్లాలు పడుతూ ప్రజలను మరింత ఇక్కట్లకు గురి చేస్తుంటే ప్రబంధాలు, ప్రేమ కావ్యాలు కాదు రాయవలసినవి, చైతన్యపరిచే కథలు, కవితలు, పద్యాలు విరివిగా నిబద్ధతతో రాయాలని హెచ్చరిక చేశారు. కట్నాల సెగలకి పట్నాలే కాదు పల్లెలు కూడా మాడిపోతున్నాయని, గ్లోబల్ భూతం మొత్తం లోకాన్ని చుట్టుముట్టి మట్టుపెట్టాలని చూస్తుంటే, ఎదుర్కొని ధైర్యాన్ని, మనో నిబ్బరాన్ని అందించి ఓటుతో పాలకులకు బుద్ధి చెప్పగలిగే కవిత్వం కావాలి, రావాలి, రాయాలన్నారు. సదస్సుకు అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఆనందాచారి మాట్లాడుతూ సాహిత్య అవసరాన్ని, దానికున్న తేజాన్ని, వేగాన్ని, బలాన్ని క్లుప్తంగా వివరించారు. మేడగాని శేషగిరి ఆలపించిన "దేశమును ప్రేమించుమన్న" గురజాడ గేయంతో సదస్సు ప్రారంభమైంది. మధ్యలో వెంకటయ్య, శేషగిరి పాటలతో సభకు వన్నె తెచ్చారు. ఆదివారం కమిటీ సభ్యులు నరసింహారావు, వీరభద్రయ్య, జనార్ధనస్వామి, నాగేశ్వరరావు కవితా ప్రసాద్‌ను శాలువా, ఒక మెమెంటోతో సత్కరించారు. బి.వి.కె. బాధ్యులు రామారావు, వి.డి.ఎం.వి. ప్రసాద్, గోపాలరావు, కందాద్రై శ్రీనివాసులు, కపిల రాంకుమార్, "ఆదివారం మీ కోసం" కార్యదర్శి హిమబిందు పాల్గొన్న సదస్సు విజయవంతంగా జరిగింది.



సాహితీ స్రవంతి, ఆదివారం మీ కోసం సంయుక్త ఆధ్వర్యంలో "ప్రజలు - సాహిత్యం" పై ప్రసంగిస్తున్న రాళ్ళబండి కవితా ప్రసాద్, సభాధ్యక్షుడు ఆనందాచారి



కవి డా॥ రాధేయకు నెల్లూరుజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో నందన నామ సంవత్సర ఉగాది పురస్కార ప్రదానం. చిత్రంలో ఎ. జయప్రకాష్, పాతూరి అన్నపూర్ణ, మాటేటి రత్నప్రసాద్, మెట్టు రామచంద్రప్రసాద్, శ్రీనివాస కుమార్ తదితరులు




ఏప్రిల్ 15న తిరుపతి పట్టణంలోని ఎస్వీ యూనివర్శిటీ ఆర్ట్స్ బ్లాక్ ఆడిటోరియంలో కథా రచయిత కలువకొలను సదానందకు బెంగుళూరుకు చెందిన చర్ప సాహితీ సంస్థ పురస్కారం అందజేసి సత్కరిస్తున్న దృశ్యం




అనంతపురంలో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో అంబేద్కర్ జయంతిని పురస్కరించుకుని ర్యాలీ, జనకవనం నిర్వహించారు. చిత్రంలో కుమారస్వామి, తగరం కృష్ణయ్య, ఆకుల రఘురామయ్య, ఎ.ఎ. నాగేంద్ర తదితరులు



మార్చి 4న ఇందూరు భారతి (రచయిత సమాఖ్య) నిజామాబాద్ వారు నిర్వహించిన 'జీవన సంధ్య' కవితల పోటీ న్యాయ నిర్ణేతగా ప్రసంగిస్తున్న డా॥ నాళేశ్వరం శంకరం
ఎడమ నుండి ఎ. సూర్యప్రకాశ్, కల్లూరు సాంబయ్య



మార్చి 28, 29 తేదీల్లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో జరిగిన సభలో "తొలి మహామంత్రిణి నాయకురాలు నాగమ్మ" పుస్తక రచయిత వైహెచ్‌కె మోహనరావును సన్మానిస్తున్న ఆచార్య పి. చెన్నారెడ్డి, ఆచార్య ఆర్. చంద్రశేఖర్‌రెడ్డి, ఆచార్య తాతిరెడ్డి, శ్రీశైలం దేవస్థాన ట్రస్టు బోర్డు ఛైర్మన్ ఇమ్మడిశెట్టి కోటేశ్వరరావు



అభినందన సంస్థ ఆధ్వర్యంలో గురజాడ శోభా పేరిందేవి రచించిన విధిని ఎదురిస్తున్న వీధి బాలలు, 'పేదపిల్లలు' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా॥ సి. నారాయణరెడ్డి. సభాధ్యక్ష ఆచార్య గోపి, కార్యక్రమం నిర్వహించిన అభినందన భవాని, చొకాపు వెంకట రమణ, కళా వేంకట దీక్షితులు



మార్చి 23న మహబూబ్‌నగర్ జిల్లా ఉగాది రోజున స్థానిక టౌన్ హాల్‌లో తెలుగు సాహితీ వికాస కళావేదిక ఆధ్వర్యంలో జరిగిన సభలో గన్నోజు శ్రీనివాసాచారి రచించిన 'పద్య మంజూష' కావ్యాన్ని ఆవిష్కరిస్తున్న జిల్లా కలెక్టర్ ఎం. పురుషోత్తమరెడ్డి.
వేదికపై చిత్రంలో కృతికర్త గన్నోజు శ్రీనివాసాచారి, కవులు డా॥ కె. బాలస్వామి, కట్టా గిరిజా రమణ, ఎస్పీ లక్ష్మీరెడ్డి, వెంకటేశ్వర్లు, రాజేశ్వరరావు, ఎం.ఎ. ఘని



నెల్లూరు జిల్లా రచయితల సంఘం అధ్వర్యంలో మార్చి 25న రెండు పద్య కావ్యాల ఆవిష్కరణ సభలో పాల్గొన్న (ఎడమ నుండి కుడికి) పాతూరి అన్నపూర్ణ, మెట్టు రామచంద్ర ప్రసాద్, ఉక్కం రమణయ్య, డా॥ రాధేయ, ఎ. జయప్రకాష్, డా॥ చీమకుర్తి వెంకటేశ్వరరావు



ఏప్రిల్ 6న వరంగల్‌లో నందన గార్డెన్స్ వేదికపై వానమామలై వరదాచార్యుల శతజయంతి ఉత్సవాల సందర్భంగా జరిగిన సభ. జ్యోతి ప్రకాశనం చేసి సభను ప్రారంభిస్తున్న రాష్ట్ర మంత్రి పొన్నాల లక్ష్మయ్య, చిత్రంలో డా॥ చుక్కా రామయ్య, కెప్టెన్ వి. లక్ష్మీకాంతరావు, డా॥ కె.వి. రమణాచారి



Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad.

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు



వెల: రూ. 40/-



వెల: రూ. 200/-



వెల: రూ. 25/-



వెల: రూ. 30/-



వెల: రూ. 40/-



వెల: రూ. 40/-



వెల: రూ. 35/-



వెల: రూ. 20/-



వెల: రూ. 150/-



వెల: రూ. 20/-



వెల: రూ. 50/-



వెల: రూ. 100/-



వెల: రూ. 20/-



వెల: రూ. 150/-



వెల: రూ.200/-



వెల: రూ. 35/-



వెల: రూ. 40/-



వెల: రూ. 20/-



వెల: రూ. 50/-



వెల: రూ. 150/-

ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013,27608107, ఫాక్స్: 04027635136

SAHITYA PRASATHANAM RNI NO.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/10-12

PRSVM02A137

NuZen HERBALS

కీళ్ల నొప్పులా...?

ఆర్థోజెన్
హెర్బల్ సిరప్

తీవ్రమైన నొప్పులకు తిరుగులేని పరిష్కారం!

- మెడనొప్పి
- వెన్నునొప్పి
- మోకాళ్ల నొప్పి
- మణికట్టు నొప్పి
- మడిమల నొప్పి
- భుజం నొప్పి




Contact : 040 - 23 60 00 93
040 - 22 22 22 44

Available at: all Medical Stores

Andhra Pradesh: Vamsee Pharma 9948495780, 9246476121, 9849082686, DGM 9959098030, ZM: 9959098014, ASM: 9959098010.
Karnataka: Rakesh Enterprises: 080-26587111, 9379844141, ZM: 9900026812,
Tamilnadu: Medisales India Pvt. Ltd.: 044-43471555, ZM: 9840436187, ASM 9791040580.

50

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A137 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |